# కమ్యూనిజం

జనవరి-ఫిబ్రవరి 1980

- ★ ఓటర్ల తీర్పు
- ★ కేరళ, బెంగాల్ ప్రత్యామ్నాయం
- ★ భగ్నమైన ఆర్.ఎస్.ఎస్. వ్యూహం
- ★ లెనినిజం
- ★ ట్రాట్స్కీయిజం
- ★ స్టాలిన్
- ★ ఆఫ్ఘనిస్థాన్‌లో జరుగుతున్న దేమిటి?
- ★ అమెరికా-చైనా కుట్ర

# మార్క్స్ పేరు యుగయుగాల్లో నిలిచిపోతుంది

ఫ్రెడరిక్ ఏంగెల్స్

అన్నిటికంటే ముఖ్యమైన విషయమేమంటే, మార్క్స్ ఒక విప్లవకారుడు. జీవితంలో ఆయన ధ్యేయం పెట్టుబడిదారీ సమాజాన్ని, అది సృష్టించిన రాజ్యాంగ సంస్థల్ని ఏదో ఒక విధంగా కూలద్రోయడం; ఆధునిక కార్మికవర్గ విముక్తికి దోహదం చేయడం, కార్మికవర్గం తమ స్థానాన్నీ, తన అవసరాల్నీ, తన విమోచనకవసరమైన పరిస్థితుల్నీ అర్థం చేసుకొనేటట్లు చేసిన మొట్టమొదటి వ్యక్తి ఆయనే. పోరాటం ఆయన ప్రాణం. దాన్ని మరెవ్వరూ సాగించనంతటి ఉద్వేగంతో, దీక్షతో విజయవంతంగా ఆయన సాగించారు....

....ఫలితమేమంటే, ఆయన కాలంలో అందరికంటే ఎక్కువగా ద్వేషించబడిన వ్యక్తి, దూషించబడిన వ్యక్తి మార్క్స్ మాత్రమే. వివిధ ప్రభుత్వాలు—నిరంకుశ రాచరికాలు, రిపబ్లికన్ ప్రభుత్వాలు కూడ—ఆయనను తమ దేశాలనుంచి వెళ్ళగొట్టాయి. పెట్టుబడిదారీ వర్గాలు—యథాతథ స్వభావం గలవి: అత్యంత ప్రజాస్వామ్య యుతమైనవి — ఆయన మీద అపవాదులు పురిపించడంలో ఒక దానిలో ఒకటి పోటీపడ్డాయి. వీటన్నిటినీ ఆయన బూజు దులుపుతున్నట్లు దులిపి వేసుకున్నారు. వీటినాయన లక్ష్యపెట్టలేదు. తప్పనిసరి అయితేనే వీటికాయన జవాబు చెప్పేవారు. సైబీరియా గనులు అగాయము కాలిఫోర్నియా వరకు, యూరపు అమెరికాల్లోని అన్ని ప్రాంతాల్లో నివసించే లక్షలాది తోటి విప్లవ కార్మికులచే ఆయన ప్రేమింపబడ్డాడు; గౌరవింపబడ్డారు; చివరకు వారందరినీ దుఃఖ సముద్రంలో ముంచి వెళ్ళిపోయారు. ఆయనకు ప్రతిరేకులు అనేకమంది ఉండవచ్చు: కాని వ్యక్తిగత శత్రువు లెవరూ ఆయనకు లేరని ధైర్యంగా నేను చెప్పగలను. ఆయన పేరు యుగయుగాల్లో నిలిచిపోతుంది; ఆయన కృషి కూడ అలాంటిదే!

కారల్ మార్క్స్ సమాధివద్ద
యిచ్చిన ఉపన్యాసం నుంచి
(1883)

★

# అంతిమ విజయం తథ్యం

ఫ్రెడరిక్ ఏంగెల్స్

...మానవజాతి ఒక మహా శిరస్సును కోల్పోయింది. అది మన యుగంలో అతి పెద్దదైన శిరస్సు. శ్రామికోద్యమం యికముందు కూడా సాగుతూనే ఉంటుంది. కాని, నిర్ణాయక సమయాల్లో ఫ్రెంచివారు, రష్యన్లు, అమెరికన్లు, జర్మన్లు తమంత తాము ఏ కేంద్ర బిందువునైతే స్పష్టమైన, నిర్ద్వంద్వమైన సలహాలకోసం ఆశ్రయిస్తూ ఉండేవారో, ఆ కేంద్ర బిందువిప్పుడు కొరవడుతోంది. ఎల్లప్పుడూ వారట్టి సలహాలను పొందుతూ ఉండేవారు. అట్టి సలహాలను అపూర్వమైన మేధా సంపన్నులు, పరిస్థితుల్ని సాంగోపాంగంగా ఆకళించుకొన్నవారు మాత్రమే ఇవ్వగలరు. స్థానికులైన బుద్ధికుశలురు, అల్పులైన మేధావులు, ఒక్కొక్కప్పుడు మోసగాండ్రు సైతం, స్వేచ్ఛగా సలహాలు పొందేవారు. అంతిమ విజయం తథ్యమేగాని, వంకర టింకర మార్గాలు తాత్కాలికమైన పెడ ధోరణులు — యివి నివారించలేనివి — యిదివరకు కంటె అధికమవుతాయి. వాటిని మనం సరిదిద్దుకోవాలి. లేకపోతే, ఇక్కడ మనం ఎందుకు? ఆ కారణంచేత మనమెన్నడూ ధైర్యాన్ని వీడవద్దు.

ఎఫ్. ఎ. సోర్జికి వ్రాసిన ఒక లేఖ నుంచి (1883)



# మార్క్సు, ఎంగెల్సులపై లెనిన్

....నిజం చెప్పాలంటే, "పెట్టుబడి" యొక్క ఈ రెండు సంపుటాలూ[1] ఇద్దరి కృషి ఫలితం: మార్క్సు, ఎంగెల్సులు. పురాణగాథల్లో మిత్రత్వాన్ని గురించిన గాథలెన్నో ఉన్నాయి. అవి మానవ హృదయాల్ని కదిలించి వేస్తాయి. యూరపియన్ కార్మికవర్గం, తన విజ్ఞాన శాస్త్రాన్ని మోఘమైన ఇద్దరు విద్వాంసులు సృష్టించారని చెప్పుకోవచ్చు. ఆ ఇద్దరిమధ్య సంబంధం ప్రాచీనుల అత్యుత్తేజకర గాథల్ని మించిపోయింది. ఎంగెల్సు, తాను మార్క్సు తర్వాతివాణ్ణని ఎవరెరుగకుండా—మొత్తంమీద న్యాయంగా కూడ — చెప్పుకొనేవారు. ఆయన ఒక పాత స్నేహితుని కిలా వ్రాశారు: "మార్క్సు జీవించియున్న కాలంలో నేను వంత మాత్రమే పాడేవాణ్ణి." సజీవ మార్క్సుపట్ల ఆయన చూపిన ప్రేమ, నిర్జీవ మార్క్సు స్మృతిపట్ల ఆయన చూపిన పూజ్యభావం అనంతమైనట్టివి. దృఢచిత్తుడైన ఈ యోధుని ఆత్మ, ఈ భావుకుని హృదయం ప్రగాఢ ప్రేమతో నిండియుండేవి........

"ఫ్రెడరిక్ ఎంగెల్సు" అను వ్యాసం నుంచి (1895)



# ఆశయం కొరకు....

కార్ల్ మార్క్స్

నేను మీకెందుకు జవాబు వ్రాయలేదనే గదా మీరడిగేది? నేనిన్నాళ్ళూ ఎడతెగకుండా సమాధి అంచున తారాడుతూ ఉన్నాను. అందుచేత, నా గ్రంథాన్ని[1] పూర్తి చేసేందుకు ఓపిక ఉన్నప్పుడల్లా ప్రతి నిమిషాన్నీ ఉపయోగించవలసి వచ్చేది. ఆ గ్రంథం కోసం నా ఆరోగ్యాన్నీ, సౌఖ్యాన్నీ, కుటుంబాన్నీ కూడా త్యాగం చేశాను. దీనికి యింతకన్న అదనపుదేదీ చేర్చనక్కర లేదనుకుంటాను.

## ఎస్. మేయర్‌కి వ్రాసిన ఒక జాబు నుంచి (1867)

1. మార్క్స్ ప్రస్తావిస్తున్నది తన "కాపిటల్" (పెట్టుబడి) అను గ్రంథాన్ని గురించి.



## ఫ్రెడరిక్ ఎంగెల్స్‌కి వ్రాసిన ఒక లేఖ (1867)

ప్రియమైన ఫ్రెండ్,

ఇప్పుడే నేను గ్రంథపు చివరి పేజీ (49 వది) సరిదిద్దడం పూర్తి చేశాను. అనుబంధం- విలువ యొక్క రూపం- చిన్న అక్షరాల్లో 1¼ పేజీ ఉంటుంది.

దీని తొలిపలుకు నిన్ననే దిద్దిపంపాను కాబట్టి, ఈ సంపుటం పూర్తి అయిందన్నమాట. ఇది మీ వల్ల మాత్రమే సాధ్యం అయింది. నాకోసం మీరు స్వార్థాన్ని త్యాగం చేసియుండకపోతే, మూడు సంపుటాల కోసం నేను చేసిన యీ బ్రహ్మాండమైన కృషి జరిగియుండేది కాదు. మిమ్మల్ని నేను ఆలింగనం చేసుకొంటున్నాను. మీ కెన్నో ధన్యవాదాలు!



మీ....
కార్ల్ మార్క్స్

# మార్క్స్ విశ్వాసాలు (1865)

మీ కతి ప్రియమైన సద్గుణం :
నిరాడంబరత
పురుషులలో మీ కతి ప్రియమైన సద్గుణం:
సశక్తత
స్త్రీలో మీ కతి ప్రియమైన సద్గుణం :
అశక్తత
మీలో ప్రధాన లక్షణం : ఏకాగ్రత
సౌఖ్యమనగా మీ భావం : పోరాడటం
దౌర్భాగ్యస్థితి అనగా మీ భావం :
లొంగుబాటు
మీ రన్నిటికంటే ఎక్కువగా క్షమించే దుర్గుణం : వంచింపబడుట
మీ రన్నిటికంటె అసహ్యించుకొనే దుర్గుణం : దాసత్వం
ఎవరంటే మీ కతి చీదర? :
మార్టిన్ టప్పర్[4]
మీ కతి ప్రియమైన వృత్తి :
గ్రంథ భక్షణ

మీ కతి ప్రియమైన కవి :
షేక్స్పియర్, ఎచిలస్[5], గెథే[6]
మీ కతి ప్రియమైన గద్య రచయిత :
డిడెరో[7]
మీ కతి ప్రియమైన నాయకుడు :
స్పార్టకస్[8], కెప్లర్[9]
మీ కతి ప్రియమైన నాయకురాలు :
గ్రెషెన్[10]
మీ కతి ప్రియమైన పుష్పం : డఫ్నె
మీ కతి ప్రియమైన రంగు : ఎరుపు
మీ కతి ప్రియమైన పేరు :
లారా జెన్నీ[11-12]
మీ కతి ప్రియమైన వంటకం : చేప
మీ కతి ప్రియమైన సూక్తి : మానవ లక్షణం గలదేదీ విజాతీయం కాదు.[13]
మీ కతి ప్రియమైన మూల సూత్రం : ప్రతివ్యక్తీ ప్రతి దాన్నీ శంకించాలి[14]

---

3. ఈ ప్రశ్నలూ, వీటికి మార్క్స్ యిచ్చిన జవాబులూ మూడు ప్రతుల్లో ఉన్నాయి. ఆ మూడూ, కొద్దిపాటి తేడాలతో సమానమే. ఒకటి మార్క్స్ భార్య జెన్నీ వద్ద, మరొకటి మార్క్స్ కుమార్తె లారా వద్ద ఉన్నాయి. మూడవది యిదీ. ఇవి, మాస్కో ప్రగతి ప్రచురణాలయం వారి "కమ్యూనిస్టు మొరాలిటీ" (కమ్యూనిస్టు నీతి) అనే పుస్తకంలో ప్రచురింపబడింది.

4. మార్టిన్ టప్పర్ (1810-89) = ఆంగ్ల రచయిత. ఇతని లక్షణం సర్వ సామాన్యత అని మార్క్స్ అభిప్రాయం. ఇతని రచనల్లో చౌకబారు జనరంజకత్వం సాధించాలనే తపన కనబడుతుంది.

5. ఎచిలస్ (క్రీ. పూ. 525-456) = గ్రీక్ నాటక రచయిత.

6. గెథే (1749- 1832) = జర్మన్ కవి, నాటక రచయిత.

7. డిడెరో (1713-84) ఫ్రెంచి భౌతిక వాది, విజ్ఞాన సర్వస్వకర్త.

8. స్పార్టకస్ = ప్రాచీన రోమన్ సామ్రాజ్యంపై జరిగిన బానిసల తిరుగుబాటుకు నాయకుడు, బానిస.

9. కెప్లర్ (1571-1630) = జర్మన్ ఖగోళ శాస్త్రజ్ఞుడు.

10. గ్రెషెన్ = గెథే రచించిన "ఫాస్ట్" అను నాటకంలో నాయకురాలు.

11-12. లారాజెన్నీ = మార్క్స్ కుమార్తె.

13. మూలం లాటిన్ భాషలో ఉంది దానికిది స్థూలానువాదం.

14. దీని మూలం కూడా లాటిన్ భాషలోనిదే. జ్ఞానసాధనకిది మార్గమని మార్క్స్ భావం కావచ్చు.

# సంపూర్ణ మానవతా వాదంగా కమ్యూనిజం వైపు మార్క్స్

— జి. వోల్కోవ్

నరక ద్వారం దగ్గర డిమాండు చేసినట్టే
విజ్ఞాన శాస్త్ర ద్వారం దగ్గర డిమాండు చేయాలి :
Qui si convien lasciare orgi sospetto
Orgi vita convien che qvi sia morta.

కార్ల్‌మార్క్స్1

1840 లలో పారిస్ యూరప్‌కు రాజకీయ, సాంస్కృతిక కేంద్రంగా వుండేది. విప్లవకారులు, పోలెండ్, ఇటలీ, రష్యా, జర్మనీల నుండి రాజకీయ ప్రవాసులు యిక్కడ గుంపులు గుంపులుగా వున్నారు. జర్మనీలో లాగా కాకుండా యిక్కడ ప్రతి వస్తువూ యిటీవలి కాలంలో సంభవించిన ఉత్కృష్ట ఘటనల, నూతన సామాజిక పోరాటాల నిరీక్షణ- ఈ రెండిటి విప్లవ సుగంధ పరిమళాలు వెదజల్లుతాయి

ఆనాటి పారిస్ నగరాన్ని గూర్చి యువఏంగెల్స్ యిలారాశాడు: "యూరప్ నాగరికత అందంగా విరబూసిన, యూరప్ చరిత్ర జీవనాడులన్నీ ఒకచోట ఐక్యమై యావత్ప్రపంచాన్నే కంపింపజేయగల విద్యుద్ఘాతాలు క్రమం తప్పకుండా వెలువడే నగరమైన పారిస్. ఆనందానుభూతి కోసం పడే తపనను చారిత్రక కార్యాచరణం కోసం పడే తపనతో సాటిలేని రీతిలో మేళవించే ప్రజలుగల నగరం. అత్యంత నాగరికులైన ఏథెన్స్ ఎపిక్యూరియన్‌లాగా జీవించడమెలాగో, అత్యంత వీరోచిత స్పార్టన్‌లాగా మరణించడమెలాగో తెలిసిన ప్రజలు గల పారిస్ నగరం ఒక్క ఫ్రాన్స్‌కే వుంది....1".

స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వమనే ఉన్నతాదర్శాల స్థానంలో ధనార్జనాదర్శాన్ని నెలకొల్పిన బూర్జువా వ్యాప

1. Karl Marx, A Contribution to the Critique of Political Economy ' p. 23. ఈ ప్రకటనతో మార్క్స్ డాంటె Divin e Comedy నుండి ఉదాహరించాడు.

1. Frederick Engels, "From Paris to Berne.".Marx, Engels, Collected works, Vol. 7. Moscow, 1917. p. 512.

స్థపై అసంతృప్తి పారిస్‌లో కనిపించినంతగా బహుశా మరెక్కడా కనిపించలేదు.

పెట్టుబడిదారీసమాజస్థానంఆక్రమించబోయన్న సమాజాన్ని సామాజికాలోచన సిద్ధాంతంతో ముందే గ్రహించి, నిరీక్షించ ప్రయత్నించింది యిక్కడే కావడం యాదృచ్ఛికం కాదు. ఊహాస్వర్గవాదులైన సెయింట్ సైమన్, ఫోరియెర్‌ల తర్వాత కాబే, డెజమీ, బ్లాంకి, ప్రొధన్, వెరోలు బయలుదేరారు. ప్రగతిశీల మేధావి వర్గంలో, కార్మిక బృందాల్లో, యూనియన్లలో వీళ్ళకు గొప్ప పలుకుబడి వుండేది. ఫ్రాన్స్ శ్రామిక వర్గం అప్పటికీ బూర్జువా వర్గాన్ని ఎదుర్కొనే సమర్థత గల సామాజిక శక్తిగా రూపొందింది.

పారిస్ నుండి చారిత్రకాభివృద్ధి మార్గాలు జర్మనీలో కంటే మహా విశాలంగా, సుమారం తీసుకెళ్ళగలిగిన రీతిలో తెరుచుకుంటున్నాయి. అందువల, వాస్తవంగా చెప్పాలంటే పారిస్‌లోనే మార్క్స్ మార్క్సిస్టుగా మారటం, శాస్త్రీయ కమ్యూనిజపు నిర్ణయాత్మక భావాలు కనుగొని రూపొందించడం సహజమే.

ఒక విప్లవ సిద్ధాంతాన్ని సృష్టించడానికి, సిసలైన పోరాట నినాదాన్ని కనుక్కోడానికి గత వర్గ పోరాటాల అనుభవాన్ని సామాన్యీకరించడం అవసరమయింది. మార్క్స్ జర్మనీలో క్రాయేత్ఫనఖ్‌లో ఈ అనుభవాన్ని అధ్యయనం చేయడం ఆరంభించాడు. కాని, ఈ పని పూర్తిచేయడానికి పారిస్‌లో అద్భుతమైన పరిస్థితులున్నట్లు ఆయన గ్రహించాడు. బూర్జువా చరిత్రకారులు థీయెర్రీ మిగ్నె, గిజో, థీయెర్స్ తదితరుల రచనలు అధ్యయనం చేశాడు. వీళ్ళ వర్తమాన సమాజంలోవర్గాలు వర్గ పోరాటాలువున్నాయని అవిష్కరించినట్లు మార్క్స్ తర్వాత అంగీకరించాడు. మాంటెస్క్యూ, మాకియవెల్లి, రూసోల సామాజిక సిద్ధాంతాలను కూడా అధ్యయనం చేశాడు.

చరిత్ర మొత్తం వర్గపోటాల చరిత్ర అయినట్లయితే తార్కికంగా ఈ కింది ప్రశ్న వుత్పన్నమౌతుంది. వర్తమాన పరిస్థితుల్లో విప్లవశక్తిగల వర్గమేది? భవిష్యత్తు ఏ వర్గానిది? అది యెలాంటి భవిష్యత్తు?

మార్క్స్ మళ్ళీ ఫ్రెంచి భౌతికవాదం నుండి నేరుగా వుద్భవించిన ఊహాస్వర్గ సోషలిజాన్ని కమ్యూనిజాన్నిసూక్ష్మంగా అధ్యయనం చేయడం మొదలెట్టాడు. మానవతా సూత్రాలకు అనుగుణంగా లేదని బూర్జువా సమాజాన్ని సెయింట్ సైమన్, ఫోరియర్లు యిదివరకే తాత్వికంగా విమర్శించారు. వాళ్ళు కూడా శ్రామికవర్గాన్ని దృష్టిలోకి తెచ్చారు. అయితే వాళ్ళు దాన్ని పీడితవర్గంగా, బాధలను గురౌతున్న వర్గంగా దీన్ని జాలి చూపడానికి, దాతృత్వం చూపడానికి అర్హమైనదిగా మాత్రమే భావించారు.

మొత్తం ప్రపంచమంతా అఖండ భావ వ్యక్తీకరణగా హెగెల్‌కు ఎలా కనిపించిందో అలాగే ఊహాస్వర్గవాదులకు సోషలిజం మానవ సంబంధాల పరమ సత్యవ్యక్తీకరణలాగా కనిపించింది. హెగెల్‌ను అతని తప్పుడు అభిప్రాయం అఖండభావం తనంతతాను సాక్షాత్కారం పొందుతుందనే పిడివాద సూత్రాన్ని

సృష్టించడానికి దారితీసింది. అలాగే ఊహా స్వర్గవాదులు, వాళ్ళలో ప్రసిద్ధులు కూడా (ప్రత్యేకించి ఫోరియర్) సమాజాభివృద్ధికి 'ఆదర్శవంతమైన ప్రణాళికలు నిర్మించాలనేదానికి.' సర్వవైరుధ్యాలను పరిష్కరించడానికి అవి అమలు జరుపుతే చాలనేదానికి మొత్తం విషయాన్ని కుదించారు.

హెగెల్‌ను అధిగమించడంగానీ, ఊహాస్వర్గ సోషలిజం అధిగమించడంగానీ, ఈ రెండూ రెండు సమానాంతర సమస్యలు కావు. అవి రెండూ ఒకే సమస్య. సమాజాభివృద్ధిని శాసించే అంశమేదో అన్వేషిస్తే దీనికి పరిష్కారం దొరుకుతుంది.

వాస్తవికతే అనుకూలంగానడుకోవాల్సి వచ్చే "రెడీమేడ్ ప్రణాళికల నిర్మాణం" గానీ, "పిడివాద అనిర్దిష్ట భావనలు" గానీ-అవి హెగెల్ సిద్ధాంతంలో వున్నా లేదా ఊహాస్వర్గ సోషలిజంలో వున్నా-మార్క్స్‌కు ఎప్పుడూ నచ్చలేదు. మానవ ఆలోచన సాధించిన ఈ ఘన విజయాల్లో ఏ ఒక్కటీ ప్రపంచాన్ని మార్చడానికి ఉపయుక్తమయిన సాధనం కాజాలదు. కాని ఈ రెండు సిద్ధాంతాల లోపలే వాటి తిరస్కరణ వుంది. హెగెల్‌కు సంబంధించి గతితార్కిక పద్ధతి ఆలోచనే ఈ తిరస్కరణ. ఊహాస్వర్గ సోషలిస్టులకు సంబంధించి, మనిషిని అవిటివాణ్ణిగా చేసే, మనిషి సారభూతతత్వానికి అనుగుణంగా లేని సంబంధాలుగా బూర్జువా ఆస్తి సంబంధాలపై వారి విమర్శే ఈ తిరస్కరణ.

న్యాయశాస్త్రి దృష్ట్యానే గాకుండా, ఆర్థిక దృష్ట్యా కూడా ఈ సంబంధాల స్వభావాన్ని వివరించడంకోసం మార్క్స్ బూర్జువా అర్థశాస్త్రాన్ని లోతుగా అధ్యయనం చేశాడు-ఆడం స్మిత్, మెకల్లోక్, జేమ్స్‌మిల్, జీన్ బాప్టిస్ సే, స్కార్‌బెక్, డెస్టట్ డిట్రాసీ, బోయిస్ గిల్‌బెర్ట్‌ల రచనలు విశ్లేషించాడు. యువ ఏంగెల్స్ రాసి Deutsch-Framgisisehe Jahrbucher పత్రికలో ప్రచురించిన "అర్థశాస్త్ర విమర్శ స్థూలరేఖలు" (Outlines of a critique of political economy) అన్న వ్యాసం మార్క్స్‌కు అదనపు ప్రేరణనిచ్చింది. మార్క్స్ దీన్ని అద్భుతమయిన రచనగా పేర్కొన్నాడు.

రాజకీయ ప్రత్యర్థి వర్గాల్లోని ప్రసిద్ధ వ్యక్తులలో, ప్రజాతంత్ర వాదులలో, సోషలిస్టులైన లూయీబ్లాంక్, పీర్‌లెరో, హైన్‌రిష్ హైనె, పీర్ జోసెఫ్‌ప్రౌధన్ మిహాయిల్ బకూనిన్‌లతో వ్యక్తిగతంగా పరిచయంచేసుకునేఅవకాశం మార్క్స్‌కు పారిస్‌లో లభించింది.

సైద్ధాంతిక విమర్శను వర్గాల నిజమయిన పోరాటంతో జోడించాలనే తన కోరికకు అనుగుణంగా మార్క్స్ జర్మనీ చేతివృత్తులవారి విప్లవ బృందాలతో, ఫ్రెంచి కార్మికులతో సంబంధాలు ఏర్పరచుకొన్నాడు. విన్సెనెస్ కోట దగ్గర ఒకానొక పారిస్ ద్వారం వద్ద విప్లవ కార్మికుల సమావేశాల్లోమార్క్స్ పాల్గొన్నాడని పోలీసు రిపోర్టుల్లో రాశారు.

దేనికోసం పోరాడాలో, ఎలా పోరాడాలో చక్కగా తెలిసిన రాజకీయ నాయకునికి కావాల్సిన దృఢనిశ్చయం. స్థిరచిత్తం మార్క్స్‌లో వున్నాయని పసిగట్టి విప్లవ కార్మికులు మార్క్స్‌ను ఎంతో అభిమానించారు. జర్మన్ కార్మికుల రాజకీయ నాయకుల్లో ఒకడైన హెర్మన్ ఎవెర్‌బెక్ యిలారాశాడు: "కార్ల్ మార్క్స్ నిస్సందేహంగా జి.ఇ. లెస్సింగ్ అంతటి మేధావి. అసాధారణమయిన తెలివితేటలతోబాటు ఉక్కులాంటి ధృఢస్వభావం, తొణకని సూక్ష్మబుద్ధి, అపార పాండిత్యంగల కార్ల్ మార్క్స్ ఆర్థిక, రాజకీయ, న్యాయశాస్త్ర, సామాజిక సమస్యల అధ్యయనానికి అంకితమయ్యాడు." [1]

కార్మికుల జీవితాన్ని ప్రత్యక్షంగా గమనించడం ద్వారా మార్క్స్‌కు విప్లవ కార్మికుల నైతిక బలం, జ్ఞాన సముపార్జన కోసం చేసే నిరంతర కృషి, మానవ ఉదాత్తతలపట్ల ప్రశంసాభావం మరింత పెరిగింది. 1844 ఆగస్టు 11 న లుడ్విగ్ ఫ్యుయెర్‌బాఖ్‌కు ఆయనిలా రాశాడు: "శ్రమభారంతో కుంగిపోయే వీళ్ళలో వెల్లివిరిసే స్వచ్ఛతను, ఔన్నత్యాన్ని విలువ కట్టాలంటే ఫ్రెంచి కార్మికుల సమావేశానికి హాజరుకావాలి. ఇంగ్లిష కార్మికుడు కూడా పెద్దపెద్ద అంగలతో పురోగమిస్తున్నాడు. కాని అతనికి ఫ్రెంచి కార్మికునికి వున్నంత సాంస్కృతిక పూర్వరంగం లేదు. అయితే స్విట్జర్లాండ్, లండన్, పారిస్‌లలోని జర్మన్ చేతివృత్తుల వాళ్ళకున్న సైద్ధాంతిక ఆధిక్యతలు నొక్కి చెప్పడం మరువరాదు. అయినప్పటికీ జర్మన్ చేతిపనివాడు యింకా చాలమటుకు చేతిపనివాడిగానే వున్నాడు.

"అయితే నా దృష్టిలో మన నాగరిక సమాజంలోని ఈ 'బర్బరుల్లోనే' మానవజాతి విముక్తికి అవసరమయిన ప్రత్యక్షంశాన్ని చరిత్ర సన్నద్ధం చేస్తోంది." [2]

ఊహాస్వర్గ సోషలిస్టులకు భిన్నంగా మార్క్స్ వీళ్ళను దయాదాక్షిణ్యాలకు పాత్రమయిన వాళ్ళుగాకాక విప్లవచర్యకు సమర్థమైన శక్తిగా భావించాడు.

సిద్ధాంతం ఆచరణల మధ్య, తత్వశాస్త్రం ప్రపంచాల మధ్య అతుకే ఈ శ్రామికవర్గం. "హెగెల్ న్యాయతత్వశాస్త్ర విమర్శకు తోడ్పాటు" (Contribution to the critique of Hegel.s Philosophy of Law) అనే తన వ్యాసంలో మార్క్స్ ఈ సూత్రీకరణ ఆవిష్కరించాడు. వస్తువులోను, రూపంలోను ఈ వ్యాసాన్ని శాస్త్రీయ రచనల్లో నిజమైన కళాఖండంగా పేర్కొనవచ్చు. ఈ వ్యాసం, దీంతో సంబంధమున్న "యూదుల సమస్యపై" అన్న వ్యాసం 1844 ఆరంభంలో Deutsch-Franze' sische Jahrabu'-cher పత్రికలో ప్రచురిత మయ్యాయి.

ఈ వ్యాసాల్లో మార్క్స్ యిలా రాశాడు: "అన్ని రకాల దాస్య శృంఖ

1. Auguste Cornu, Karl Marx and Friedrich Engels. Lebenn and Werk. Bd-2 S.18.

2. Marx, Engels, Collected Works, Vol. 3. p. 355.

లాలను బద్దలు కొట్టకపోతే" నిజమైన మానవ విముక్తి "అసాధ్యం." శ్రామిక వర్గం సర్వం కోల్పోయి, దారుణంగా అణగారిపోయిన స్థితిలోవున్న వర్గం. సమాజంలోని అన్ని రంగాలను విముక్తి చేయకుండా శ్రామికవర్గం తన విముక్తి పొందలేదు.

"ఈ విముక్తి తత్వశాస్త్రం పదవు; శ్రామికవర్గందీనిహృదయం."

ఈ వ్యాసాల్లో మార్క్స్ ముఖ్యమైన ముందడుగు వేస్తాడు - నిజమైన పోరాట నినాదాన్ని, అలాగే ఈ నినాదాన్ని వాస్తవంగా మార్చగల "భౌతిక" శక్తిని, మానవ జాతి మానవతా దర్శాలను సాధించగల భౌతిక శక్తిని కనుగొంటాడు. మార్క్స్ వేసిన ఈ అడుగును భావవాదం నుండి భౌతిక వాదంలోకి, విప్లవ ప్రజాతంత్రవాదం నుండి కమ్యూనిజంలోకి అంతిమ పరివర్తనగా లెనిన్ వర్ణించాడు.[1]

ఇరవై ఆరేళ్ళ వయసులో మార్క్స్ నూతన ప్రపంచ దృక్పథ ఉన్నత శిఖరాలకు చేరుకున్నాడు. అసమానమైన సైద్ధాంతిక చింతన ద్వారా మాత్రమే యిది సాధ్యమైంది. ఆయన తత్వశాస్త్ర, సామాజిక శాస్త్ర రంగాల్లోని యూరోప్ సాంస్కృతిక వారసత్వాన్ని మొత్తం జీర్ణం చేసుకొని దానికి సశాస్త్రీయంగా పునరాకృతి నిచ్చాడు. మార్క్స్ ఎంత చిన్న తత్వవేత్తనైనాసరే థేల్స్ ఆఫ్ మిలిటస్ నుండి లుడ్విష్ ఫ్యూయెర్‌బాఖ్, మోసెస్ హెస్‌ల వరకు స్వతంత్రాలోచన గల ఏ ఒకర్నీ పరిశీలించకుండా దాటవేయలేదు. మౌలిక చారిత్రక రచనలన్నీ ఆయన జీర్ణం చేసుకున్నాడు. ఇందులో హెరొడొటస్, ప్లూటార్చ్‌ల నుండి గిజొ వరకూ, ప్లేటో నుండి తెరో, పెట్టింగ్‌ల వరకూ వున్నారు. అర్థశాస్త్రంలోని ప్రధాన రచనలన్నీ—ఆడమ్ స్మిత్ నుండి ఫ్రెడరిక్ ఏంగెల్స్ వరకు అధ్యయనంచేశాడు. అంతిమంగా, వివిధ కళాసంస్కృతీ సంపదనంతా—లూక్రిటస్ నుండి హైన్‌రిష్ హైనె వరకు కవిత్వం, అయెషిలస్ విషాదాంత నాటకాల నుండి షేక్స్‌పియర్ నాటకాల వరకూ, ప్లేటో సంవాదాల నుండి బాల్జాక్ గద్యరచనల వరకూ మార్క్స్ ఆకళింపు చేసుకున్నాడు. అయినప్పటికీ నూతన ప్రపంచ దృక్పథ వివరణకు ఈ జ్ఞానం చాలదనిపిస్తుంది. అన్ని యుగాల్లోను ప్రపంచంలోని ప్రతి విషయాన్ని గూర్చిన జ్ఞానం సంక్కిన పడక కుర్చీ పండితులుండేవారు. కాని వాళ్ళు స్వంతంగా ఆలోచించలేని అసమర్థులు. మానవ మేధస్సుసాధించిన ఘన విజయాలను మార్క్స్ అధ్యయనంచేసి, వాటిలో ప్రావీణ్యత సంపాదించడమే గాక, తాను నిర్విరామంగా కృషిచేసి సత్యానికి జంకకుండా వాటిని సృజనాత్మక చింతనకు పనిముట్టుగా మార్చాడు.

మార్క్స్ మొదట్లో జర్మనీలోని పీడిత రైతాంగం పట్ల, ఆతర్వాత సర్వకాలాల్లోకల్లా విప్లవ వర్గాల్లో అత్యంత విప్లవకర, అత్యంత సమర్థవంతమైన

1. V. I. Lenin. "Karl Marx." Collected works Vol. 21, P. 80.

శ్రామిక వర్గం పట్ల స్పృహతో నిర్దిష్ట వైఖరి నవలంబించడం అత్యంత ముఖ్యమైన విషయం.

మానవజాతి ఆత్మిక విజయాల సామాన్యీకరణ నుండి, ఆదర్శాత్మక వ్యాఖ్యానం నుండి మాత్రమే గాక, బూర్జువా సమాజంలోనే వున్న కొన్ని ఆర్థిక, సామాజిక - రాజకీయ, ధోరణుల వ్యక్తీకరణగా కూడా (అంతిమ విశ్లేషణలో యిది నిర్ణాయక అంశంగా రుజువైంది) శాస్త్రీయ సోషలిజం (లేదా శాస్త్రీయ కమ్యూనిజం అన్నా ఒకటే) ఆవిర్భవించింది.

ఈ వాస్తవం మనసులో వుంచుకునే ఏంగెల్సు యిలా రాశాడు : "ప్రతి నూతనసిద్ధాంతంలాగే ఆధునికసోషలిజం-భౌతిక ఆర్థిక వాస్తవాల్లో దాని వేర్లు ఎంత లోతుగా వున్నప్పటికీ - మొట్టమొదట దానికి అందుబాటులో వున్న మేధో పరికరాలతో ముడిపెట్టుకోవాల్సి వచ్చింది."

మార్క్సు విప్లవ కార్యక్రమానికి గట్టి పద్ధతు నిర్మించాడు. యిది బూర్జువా ప్రజాతంత్ర వాదులతో, ప్రధానంగా ఆర్నాల్డ్ రూగ్‌తో తెగ తెంపులకు దారి తీసింది.

ఎంత తీవ్ర రాడికలిస్టు అయినప్పటికీ, స్వేచ్ఛను గురించి కలలు గనడానికి వ్యతిరేకి గాకపోయినప్పటికీ, రూగ్ దానికి మూల్యం తన సొంత జేబులోంచి చెల్లించే కోరికలేని ఫిలిస్టయిన్. Deutch Franze'sisbhe Janrbwcher అమ్మకం ద్వారా మంచి ఆదాయం వస్తుందని ఆశిస్తూ వచ్చాడు. అయితే ఈ ఆశలు అడియాసలైన తర్వాత అతడు కుంగిపోయి, ఒక వ్యాపారస్థుడంత అనుమానిగా తయారై ప్రచురణతో మార్క్సు తలపెట్టే ప్రతి పొరపాటూ తన జేబు కొట్టడానికే ప్రయత్నిస్తున్నట్లుగా భావించాడు.

అదే సమయంలో "డబ్బు విషయాల్లో" మార్క్సు కున్న "తీవ్ర అలక్ష్యాన్ని" వినియోగించడానికి రూగ్ వెనుదీయలేదు. (మెరింగ్) మార్క్సు కుటుంబం పెరుగుతూ వుంది. (ఆయన కూతురు జెన్నీ 1844 మేలో జన్మించింది) మార్క్సు దుర్భర దారిద్ర్యం అనుభవిస్తున్నప్పటికీ రూగ్ మార్క్సుకు Jahrbucher పత్రిక ప్రచురణ రూపంలో సిగ్గుమాలిన రీతిలో వేతనం చెల్లించేవాడు.

అయితే, మార్క్సు కమ్యూనిజం రూగ్‌లో దాగున్న ఫిలిస్టయిన్ (పునస్కారి) లో భయోత్పాతాన్ని సృష్టించిందనేది ప్రధానమైన విషయం.

Jahrbucher పత్రికలో సంపాదక బాధ్యతలను వదిలేసుకున్న తర్వాత మార్క్సు ద్విగుణీకృతోత్సాహంతో తన అధ్యయనలో నిమగ్నుడయ్యాడు. ప్రధానమైనది సాధించినట్లనిపించింది— నూతన ప్రపంచ దృక్పథ మూలసూత్రాలను వివరించాడు. అయితే మార్క్సుకు యిది ఆరంభం మాత్రమే. మానవజాతి

1 Frederick, Engels, "Socialism :Utopiam and Scientific".Karl Marx and Frederick Engels, Selected works, in three Volumes, Vol 3. P. 115.

భూత, భవిష్యత్, వర్తమానాలను మొత్తం పునర్వ్యాఖ్యానించడానికి ఒక నూతన దృక్పథం కోసం అన్వేషిస్తు న్నాడు. ఆయన విపరీతంగా చదివాడు. ఆయన మెదడులో ఒక ప్రాజెక్టు తర్వాత మరొకటి మెదిలింది. మొదట్లో సగంలో వదలిపెట్టిన హెగెల్ న్యాయతత్వ శాస్త్రంపై రాతప్రతి పూర్తిచేసి దాన్ని కమ్యూనిస్టు దృక్పథంనుండి వ్యాఖ్యా నించాలనుకున్నాడు. ఆ తర్వాత ఫ్రెంచి విప్లవ చరిత్రలో పూర్తిగా నిమగ్నుడై "కన్వెన్షన్" చరిత్ర రాయాలని తపిం చాడు. చివరికి, ఊహాస్వర్గ సోషలిస్టుల, రాజకీయవేత్తల విమర్శలకు పూను కున్నాడు.

ఆయన మెదడు ఎంత తీవ్రంగా పనిచేస్తూ వుండంటే, అప్పుడే రాసిన దాన్ని అధిగమించి పరుగెత్తేది. చేసిన పని ఆయన కెప్పుడూ సంతృప్తి కలి గించేది కాదు .... ఎక్కువ తెలుసుకునే కొద్దీ తనకు తెలియనిది సముద్రమంత అపారంగా కనిపించేది. అనేక ప్రశ్న లకు పరిష్కారం తెలుసుకొనేసరికి అనేకానేక కొత్త ప్రశ్నలు ఎదురయ్యేవి.

రాతప్రతులు పూర్తిగాకుండా మిగిలి పోయాయి. నూతన భావాలు సృష్టిస్తూ ఆయన ఆలోచనలు మరింత ముందుకు సాగేవి. ఆత్మవిమర్శ అనే దయ్యం ఒక సమస్యను, దాని సూక్ష్మాతి సూక్ష్మాం శాలను క్షుణ్ణంగా అధ్యయనం చేస్తే తప్ప మార్క్స్ రాసిన దేన్నీ వెలుగు చూడ నిచ్చేదికాదు.

మార్క్స్ అధ్యయనం చేసిన ఈ రోజుల్ని గురించి ఆర్నాల్డ్‌రూగ యిలా రాశాడు : "మార్క్స్ విపరీతంగా చదువు తున్నాడు. ఆయన అసాధారణమైన తీవ్రతతో పనిచేస్తాడు. ఆయనకు సూక్ష్మ పరిశీలనా ప్రజ్ఞవుంది. యిది ఒక్కొ క్కప్పుడు అర్థరహితమైన క్షీణ గతి తార్కికంగా మారుతుంది. ఆయన ఏదీ పూర్తిచేయడంలేదు. కొంతకాలం మానేసి మళ్ళీ పుస్తకాల అనంత సముద్రంలో మునిగిపోతాడు."[1]

ఈ అసాధారణ తీవ్ర పరిశోధనా స్థితి, సాధించిన దానిపట్ల నిరంతర అసంతృప్తి మార్క్స్‌ను కుంగదీసేది. కానీ చెయ్యగలిగిందేమీలేదు. వరసగా నిద్రలేకుండా అనేక రాత్రులు మరింత కష్టపడి పనిచేయడమే ఆయనకు తోచిన పరిష్కారం. "మార్క్స్ అసలే పట్ల కాని మనిషి, కాగా ప్రత్యేకించి జబ్బు పడేదాకా పనిచేసినప్పుడు మూడు నాలుగు రాత్రుళ్ళు నిద్రపోనప్పుడు మరీ చిర్రు బుర్రులాడుతూ కోపం తెచ్చు కుంటాడు."[1] అని రూగ్ రిమార్కు చేశాడు.

ఈ అధ్యయనం వలన కలిగిన అత్యంత ముఖ్యమైన ఫలితం—"1844 ఆర్థిక - తాత్విక రాత ప్రతులు" (The Economic and Philosoph-

---

1. Auguste Cornu, Karl Marx and Friedric Engels, Lebenuan wer k Bd 2. S. 19.

1. Auguste Cornu, karl Marx and Friedrich Engels. Lebenuan werk. Bd 2. S. 19.

ic Manuscripts of 1844) అనే పెద్ద అసంపూర్తి రచన.

ఈ రచనలో మార్క్సిజం జన్మించిన "పురిటినొప్పుల" చిహ్నాలు యిప్పటికీ కనిపిస్తాయి-ప్రత్యేకించి హెగెల్ నుండి, ఫ్యూయెర్‌బాఖ్ నుండి తీసుకున్న సాంకేతిక పదజాలంలో కనిపిస్తాయి. పాత భావాల శిథిలమైన పెంకులోంచి సమాజాన్ని గూర్చిన మౌలిక, నూతన దృక్పథపు, ప్రపంచానికి అంతకుముందు తెలియని ప్రపంచ వ్యాఖ్యాన దృక్పథపు చివుళ్ళు చీల్చుకుని బయటికొచ్చాయి.

ఇక్కడ మొట్టమొదటిసారిగా సమాజ విశ్లేషణకు భారీఎత్తున ఆర్థిక, తాత్విక, రాజకీయ ధోరణులను సంశ్లేషించాడు. ఇక్కడ మొత్తం పరిశీలనలో మానవుడు కేంద్ర స్థానంలో వున్నాడు. ప్రకృతితో, సమాజంతో తనకుగల సంబంధాల మొత్తం సంకీర్ణతలో కనిపిస్తాడు. యిక్కడ రచయిత నిసలైన స్థిర మానవతా దృక్పథం నుండి బూర్జువా సమాజంలోని అమానుష జీవన పరిస్థితుల స్పష్టమైన రేఖాచిత్రం గీస్తాడు. యిక్కడ రాజకీయ యోధుని ఆగ్రహం, తపన మహా తాత్వికుని విశ్లేషణా పరిణతిలో లీనమయ్యాయి. ఇక్కడ నిర్దిష్ట వాస్తవికత పట్ల నిజమైన ధోరణి సమాజాభివృద్ధికి గల సుదూరావకాశాల దృక్పథంతో మిళితమైంది. ఈరచన శతాబ్దాల పర్యంతం ప్రాముఖ్యత కోల్పోని అత్యంత గంభీర సమస్యలను లేవనెత్తుతుంది.

ఈ నాడు అన్ని దేశాల్లోని తత్వవేత్తలు, ఆర్థికవేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలు, Economic and Philosophic Manuscripts of 1844 పై చూపిస్తున్న తరగని ఆసక్తికి ఇదే కారణం

ఈ రాతప్రతుల భావాల సంపద ఎలాంటిదంటే, దీన్ని అత్యంత వివరమైన వ్యాఖ్యానంలో గానీ, అత్యంత వస్తుగత వ్యాఖ్యానంలోగానీ పునఃసృష్టి చేయడం సాధ్యంకాదు. ఏకపక్ష భావాల అవరోధాలను, సైద్ధాంతిక ప్రణాళికల సంకుచిత అవరోధాలను తుత్తునియలు చేసే, ప్రకృతిని వ్యాఖ్యానించడంలోనే గాక, సామాజికాభివృద్ధిని వ్యాఖ్యానించడంలో కూడ చివరి భావవాద శృంఖలాలను తొలగించే యీ సైద్ధాంతిక చింతనలోని పూర్తి సాహసాన్ని, విస్తృతత్వాన్ని, కళాసౌందర్యాన్ని ఆస్వాదించాలంటే ఎవరిమటుకు వాళ్ళు యీ రచనను చదివి (ఎన్నోసార్లు!) తీరాల్సిందే.

ఈ రచనలో మార్క్స్ తనకు యిదివరకే ఏర్పడిన దృక్పథంతో—అంటే మానవజాతి మొత్తం చరిత్ర వివరణ భౌతిక సంబంధాల్లో అన్వేషించాలనే దృక్పథంతో—ఆరంభిస్తాడు. ఆయన ఈ విధంగా సూత్రీకరిస్తాడు: "....విప్లవోద్యమం మొత్తం తన ప్రత్యక్ష ప్రమాణవాద (empirical) ప్రాతిపదికను, సైద్ధాంతిక ప్రాతిపదికను ప్రైవేటు పెట్టుబడి చలనంలో-మరింత కచ్చితంగా—ఆర్థిక వ్యవస్థలో అవశ్యంగా కనుగొంటుంది."[1]

---

1. Karl Marx "Economic and Philosophic Manuscripts of 1844" Marx Engels, collected works Vol. 3, P. 297.

మానవుని ఉత్పాదక జీవితం, అతని శ్రమ–యిది సామాజిక ప్రగతికి మూలం. మానవుని శ్రమ విభిన్న సామాజిక పరిస్థితుల్లో విభిన్న రూపాలు సంతరించు కుంటుంది. "అంతిమంగా, జనాభాలో రెండు వర్గాలు మాత్రమే మిగిలిపోతాయి –కార్మికవర్గం, పెట్టుబడిదారులవర్గం."2

ఫ్యుయెర్‌బాఖ్ చెప్పే ఆ భౌతిక మనిషి స్థానంలో మార్క్స్ కార్మికుని పెడతారు. ఫ్యుయెర్‌బాఖ్ చెప్పిన ఒక మనిషి మరొక మనిషి మధ్య గల సంబంధాల స్థానంలో మార్క్స్ కార్మికునికి, పెట్టుబడిదారునికి మధ్య గల సంబంధాలను, సజీవశ్రమకు సంచిత శ్రమకు (పెట్టుబడి) మధ్యగల సంబంధాలను పెడతాడు.

ప్రతీదీ అమ్మకమూ, కొనుగోలూ అయ్యే ప్రపంచంలో డబ్బుదే సర్వాధికారం, పరమాధికారం. ఆ ప్రపంచంలో స్వయంగా కార్మికుడే ఒక సరుకు. అతనికి పెట్టుబడీ కౌలూ రెండూ లేవు. అతనికి శ్రమించగల సామర్థ్యం మాత్రమే వుంది. ఆశ్రమే సమాజ సర్వ సంపదనూ సృష్టిస్తుంది.

బూర్జువా సమాజపు ఈ వాస్తవాన్నే మార్క్స్ తన విశ్లేషణకు ప్రారంభ అంశంగా తీసుకున్నాడు.

కార్మికుడు భౌతిక సంపదను సృష్టిస్తాడు. అయితే అది అతనిది కాదు. అంతేగాక, ఈ సంపదను అతని నుండి వేరుచేయడమేగాక, పెట్టుబడిగా అతన్ని శాసించే పరాయిశక్తిగా దాన్ని అతనికి వ్యతిరేకం చేస్తారు. మార్క్స్ ఈ వాస్తవాన్ని శ్రమపరాయీకరణ అని పేర్కొన్నాడు.

కార్మికుడు ఎంత ఎక్కువ శ్రమచేస్తే అతను సృష్టించే ప్రపంచ సంపద అంత ఎక్కువ పెరుగుతుంది. కాని అదే సమయంలో కార్మికునిపై ఈ సంపద పెత్తనం కూడా పెరుగుతుంది. పెట్టుబడిదారుడు మరింత శక్తివంతుడౌతాడు. కార్మికుడు మరింత పేదవాడై, హక్కులను పరింటగా కోల్పోతాడు.

కార్మికుడు తాను సృష్టించిన వస్తువుకు బానిస అవుతాడు. పెట్టుబడి రూపంలో, ధన సంపద రూపంలో కనిపించే అతని సంచిత శ్రమ (accumulated labour) కార్మికుని కూలికి పెట్టుకొని, అతనికి జీవనోపాధి కల్పిస్తుంది. అతని సజీవ శ్రమను, అతని జీవితాన్నే విక్రయిస్తుంది.

కార్మికుని శ్రమ అద్భుతమయిన వస్తువులను సృష్టిస్తుంది. కాని, యిది కార్మికుని పేదరికాన్ని కూడా సృష్టిస్తుంది. యిది ప్రాసాదాలను సృష్టిస్తుంది. కాని కార్మికునికి మురికి వాడలను కూడా సృష్టిస్తుంది. ఇది సౌందర్యాన్ని సృష్టిస్తుంది. కాని స్వయంగా కార్మికుణ్ణి వికరూపం చేస్తుంది. యిది శారీరకశ్రమ స్థానంలో కార్మికులనే యాంత్రికంగా పనిచేసే యంత్రాలుగా మార్చే యంత్రాలను భర్తీచేస్తుంది. అతను చేసే పని ఎంత ఎక్కువ జటిలమయినదైతే అతని మనోవిధ్వంసం అంత ఎక్కువగా వుంటుంది.

2. Ibid. P. 266.

తన సృష్టికర్తపైనే వస్తువు పరిపాలన సాగించే ఈ తలకిందులు ప్రపంచాన్ని. మనుషుల మధ్య సంబంధాలు వస్తువుల మధ్య సంబంధాల రూపంలో దర్శనమిచ్చే ఈ తలకిందులు ప్రపంచాన్ని, తర్వాత మార్క్స్ పెట్టుబడి గ్రంథంలో, దానికోసం రాసిన సన్నాహక రచనల్లో విపులంగా విశ్లేషించాడు. "Economic and Philosophic Manuscripts of 1844" రచనలో ఆవిర్భవించిన రూపం మరింత స్పష్టమయిన, క్రూరమయిన ఆకారం సంతరించుకుంది.

కాని మన దృష్టి రాతప్రతుల మీదకు మళ్ళించి, మార్క్స్ వాదం గమనిద్దాం. కార్మికుని శ్రమ ఫలితాలను అతనినుండి వేరుచేయడం ఈ విషయానికి సంబంధించిన ఒక అంశం మాత్రమే. కార్మికుని కార్యకలాపం, జీవించే క్రమమూ పరాయి స్వభావం గంది. ఇది అన్ని మానవ సారభూత తత్వాన్ని స్వయం పరాయీకరణ చేసే క్రమమే అన్నది అంతే ముఖ్యమయిన మరొక అంశం.

పని అర్థమేమిటి? కార్మికుడు పనులట తానే స్వచ్ఛంద సంకల్పంతో పని చేయడు. అందువల్ల అతని కార్యకలాపం స్వయం కార్యకలాపంగాక, బలాత్కార, నిర్బంధశ్రమ. ఈ క్రమంలో కార్మికుడు తనకు చెందినవాడుగాక, అతని యజమానికి చెందిన వాడని దీని అర్థం.

ఈ నిర్బంధ శ్రమలో కార్మికుడు తన భౌతిక, మానసిక శక్తులను స్వేచ్ఛగా అభివృద్ధి చేసుకోకపోగా, క్షీణిస్తాడు. శరీరాన్ని కృశింప చేసుకుంటాడు. మనసును నాశనం చేసుకుంటాడు. తర్కదృష్ట్యా అతడు తన శ్రమలో నిజమయిన మానవ అవసరాన్ని- సృష్టించే అవసరాన్ని తీర్చుకోవాలి. కానీ అతనికి శ్రమ అనేది అత్యంత ప్రాథమిక అవసరం తీర్చుకోడానికి ఒక సాధనం.

శ్రమ అనేది ఒక శాపంగా పరిగణించడంలో, తీవ్రమయిన విరక్తితో శ్రమ చేయడంలో కలరాకు దూరంగా పారిపోయినట్లు దాన్నుండి జనం పారిపోవడంలో శ్రమలోని పరాయి స్వభావం స్పష్టంగా కనిపిస్తుంది.

శ్రమ క్రమంలో—యీ అత్యంత మానవావశ్యకతలో — కార్మికునికి తాను మనిషనిపించడు. ఇక్కడ అతడు ఒక నిర్బంధ జంతువులా వ్యవహరించాడు. యిందుకు భిన్నంగా, శ్రమకు వెలుపల తన ప్రాథమిక, మౌలికంగా జంతు ధర్మాలు నిర్వహించడంలో-తినడం, తాగడం, లైంగిక వ్యాపారం, నిద్ర వగైరాంలో-కార్మికునికి తాను స్వేచ్ఛగా వ్యవహరించే మనిషిననిపిస్తుంది. "జంతు స్వభావమయినది మానవ స్వభావంగా, మానవ స్వభావమయినది జంతు స్వభావంగా మారుతుంది."[1]

ఈ విధంగా శ్రమ పరాయీకరణ, స్వయం పరాయీకరణ జరుగుతుంది. దీని

1. Karl Marx, "Economic and Philosophic, Manuscripts of 1844" Marx, Engels, Collected works, Vol. 3, P. 275.

ప్రత్యక్ష ఫలితం మనిషికి మనిషి పరాయి వాడు కావడం—కార్మికుడు, పెట్టుబడి దారుడు అనే వ్యతిరేక స్థానాలు.

శ్రమ పరాయీకరణ, స్వయం పరాయీకరణ అనే సమస్యపై మార్క్స్ రాసిన దాన్ని ప్రతికూల అంశంనుండి పరిశీలించే వారు ఆర్థిక వాస్తవికతను ధ్వంసంచేసే విమర్శగా మాత్రమే పరిగణిస్తారు. కాని, యీ విమర్శలో వాస్తవ విషయాన్ని మార్క్స్ మదింపు చేయడం వెనుక నిశ్చిత సూత్రాలు, మానవ శ్రమ అంటే ఏమిటి, మానవ సంబంధాలు ఎలా వుండాలనే విషయంపై ఆయన భావన, అంటే కమ్యూనిస్టు సమాజాన్ని గూర్చిన భావన స్పష్టంగా కనిపిస్తుంది.

శ్రమ అనేది స్వయం పరాయీకరణగా గాక, స్వయం ధృవీకరణగా వుండాలి. అది జీవనోపాధికి సాధనంగా గాక, జీవితసారంగా, మానవుడు తన సామర్థ్యాలను పరిపూర్ణంగా, పూర్తిగా అభివృద్ధి చేసుకునే క్రమంగా వుండాలి. శ్రమకు బాహ్యానిర్బంధం ప్రేరణగా గాక, సృజనాత్మకత కోసం ఆత్మికావసర ప్రేరణగా వుండాలి.

Economic and philosophic Manuscripts of 1844 కు చాలా దగ్గరగా ఉన్న Okonomische Studien (Exzerpte) (ఆర్థిక పరిశీలనలు) అనే రచనలో మార్క్స్ పరాయీకృత మనిషి గల ఈ ప్రపంచాన్ని మనిషి నిజసామాజిక సారపు అతని "నిజవర్గ జీవితపు"[2] సామాన్య వ్యంగ్య చిత్రంగా వర్ణిస్తాడు.

Exerpte లోని ఈ కింది పుస్తకం "మానవత్వంతో" నడిచే ప్రపంచంలోని ఈ నిజజీవితాన్ని అంటే కమ్యూనిస్టు సమాజాన్ని యువ మార్క్స్ ఎలా చిత్రించాడో విశదం చేస్తుంది.

"మనుషులుగా మనం ఉత్పత్తి చేశామనుకుందాం. మనలో ప్రతి ఒక్కరూ తన ఉత్పత్తిలో తననూ, మరొకరిని రెండు విధాలా ధృవీకరించారు: 1. నేను క్రియాశీల కార్యకలాప సమయంలో *జీవిత వ్యక్తిగత వ్యక్తీకరణ* అనుభవించాను. వస్తువునుగూర్చిన ఆలోచనలో వ్యక్తిగత ఆనందాన్ని అనుభవించాను. 2. నా ఉత్పాదితాన్ని నువ్వు అనుభవించడంలో లేదా నువ్వు వినియోగించడంలో నా పనిలో....నేను మరొక మనిషి అవసరానికి అనుగుణమయిన వస్తువును సృష్టించానని గుర్తించిన ప్రత్యక్షానందాన్ని పొందాను. 3. నేను నీకూ యితరులకూ *మధ్యవర్తిగా* వున్నాను. నన్ను నీ అస్తిత్వానికివిస్తరణగా నీలో అత్యావసర భాగంగా గ్రహించావు, భావించావు: 4. నా జీవిత వ్యక్తిగత అభివ్యక్తిలో నేను నేరుగా నీ జీవిత అభివ్యక్తిని సృష్టించాను. తత్ఫలితంగా..నా వ్యక్తిగత కార్యకలాపంలో నా నిజమైన అస్తిత్వాన్ని నా మానవ, నా సామాజిక సారాన్ని నేరుగా *ధృవీకరించి*,వాస్తవం చేశాను.

"నా పని జీవిత స్వేచ్ఛాభివ్యక్తి (free manifestation) అవుతుంది. అందువల్ల *జీవితానందం* లభిస్తుంది. ప్రైవేటు ఆస్తి ఉన్నప్పుడు యిది జీవిత

2. Marx / Engels, Gesamtansgabe, Erste Abteilung Bd. 3, S. 535

పరాయీకరణ ఎందుకంటే నేను జీవించడానికి, జీవనోపాధి సంపాదించడంకోసం పనిచేస్తాను. నా పని జీవితం కాదు."[1]

బూర్జువా అర్థశాస్త్రం పాదార్థిక (భౌతిక) విలువల ప్రపంచాన్నిమాత్రమే సంపదగా గుర్తిస్తుంది. కార్మికుడనే వాడు కేవలం సంపదను వృద్ధిచేసే సాధనంగా మాత్రమే అది భావిస్తుంది. ఇది కార్మికుణ్ణి తన అవసరాలు అణచుకోమనీ, ధనాన్ని, వస్తువులను కూడబెటడంకోసం పోగుచేయడం కోసం జీవితానందాల్ని త్యాగం చెయ్యమని బోధిస్తుంది.

నువ్వు ఎంత తక్కువగా తింటే, తాగితే, పుస్తకాలు కొంటే, ఎంత తక్కువగా నాటక శాలలకు నృత్యాలకు, హోటలుకు వెళ్తే, ఎంత తక్కువగా ఆలోచిస్తే, ప్రేమిస్తే, సిద్ధాంతీకరిస్తే, పాడితే, పరిమితం చేసుకుంటే వగైరా .... అంత ఎక్కువగా పొదుపు చేస్తావు. నీ బొక్కసం నీ పెట్టుబడి, అంత పెద్దదవుతుంది. నువ్వు సంపాదించిన వస్తువులు అంత ఎక్కువవుతాయి.

ఈ దృష్ట్యా ధనహీనుడు, వస్తుహీనుడైన వ్యక్తి ఎందుకూ కొరగాడు. వస్తువులు, ధనం అతనికి సమాజంలో హోదా, ప్రాముఖ్యత కల్పిస్తాయి. అవి వ్యక్తి దృష్టిలో తనకే తాను ముఖ్యుణ్ణి చేస్తాయి.

నువ్వు స్వయంగా చేయలేనివంతా నీ కోసం నీ డబ్బు చేసి పెటగలదు. డబ్బు తింటుంది. తాగుతుంది. నృత్యాలకు, నాటకశాలలకు వెళ్తుంది. ప్రయాణించగలదు. కళాకృతులను, నైపుణ్యతను, చారిత్రక అపురూప వస్తువులను, రాజకీయాధికారాన్ని సంపాదించగలదు.

తన "Economic and Philosophic Manuscripts of 1844" రచనలోని షేక్స్పియర్ "స్వర్ణ పిశాచి" సర్వశక్తిత్వాన్ని చెప్పే ఏథెన్ టైమన్ వాక్యాలు మార్క్స్ ఉదహరించాడు :

ఈ స్వర్ణ ఖానిన
మతాలను అల్లుతుంది తెంపుతుంది,
పాపిష్టివాళ్ళను ఆశీర్వదిస్తుంది,
శ్వేత కుష్ఠ వ్యాధిని ఆరాధింప
జేస్తుంది,
దొంగలను కాపలా పెట్టి
వాళ్ళకు సెనేటర్లుగా బిరుదులిచ్చి
సాష్టాంగ పడి కీర్తిస్తుంది....

షేక్స్పియర్ ధనానికున్న రెండు ధర్మాలను ప్రత్యేకించి నొక్కిచెప్తూ "ధనం నిజస్వభావాన్ని అద్భుతంగా చిత్రించాడని"[1] మార్క్స్‌కు అనిపిస్తుంది.

"ఇది కనిపిస్తున్న దైవత్వం - మానవ సమాజ ధర్మాలన్నిటినీ వాటి

---

1 Marx/Engels, Gesamtangabe, Erste Abteilung, Ibid. S 546,47.

1. Karl Marx, "Economic and Philosophic Manuscripts of 184" Marx. Engels, Collected works, Vol. 3, P. 323-324.

పరస్పర విరుద్ధాలుగా పరివర్తన, సార్వత్రిక తారుమారు, వస్తువుల విరూపం.

"ఇది అందరికీ ఉమ్మడి ఉంపుడు కత్తె. ప్రజలన్నూ, దేశాలను కొనే ఉమ్మడి కొనుగోలుదారు........ ధనం అనేది మానవజాతి పరాయీకృత సామర్థ్యం."[1]

షేక్స్పియర్, గొథెల కవిత్వంతో ఉత్తేజం పొంది ఈ భావాలను ఆ తర్వాత మార్క్స్ "అర్థశాస్త్రం, పెట్టుబడి విమర్శకు చేర్పు" (A contribution to the critique of Political Economy and Capital) అనే రచనలో అభివృద్ధి చేశాడు.

యువ మార్క్స్ వెల్లడించినట్లుగా, తారుమారైన ప్రపంచంలో, పరాయీకరణ ప్రపంచంలో ఆర్జనే జీవిత పరమావధిగా మారుతుంది. నిజమైన మానవావసరాల అభివృద్ధి స్థానంలో ప్రయోజనం మాత్రమే ప్రధానంగా భావించే వినిమయదారు ధోరణి ఏర్పడుతుంది. మనిషి వస్తువులకుగాక, మనిషికి వస్తువులు కొలమానంగా తయారవుతాయి.

పరాయీకరణ ప్రపంచం అనేది ఆస్తికి మాత్రమే కుదించిన మొరటు, ఆదిమ అవసరాల ప్రపంచం. "ప్రైవేటు ఆస్తి మనల్ని ఎంత బుద్ధిహీనులుగా, ఏకపక్షంగా మార్చిందంటే-ఒక వస్తువు మనదగ్గర వున్నప్పుడు మాత్రమే అది మనది—లేదా మనం నేరుగా అనుభవించినప్పుడు, తిన్నప్పుడు, తాగినప్పుడు, ధరించినప్పుడు, నివశించినప్పుడు....వగైరా మాత్రమే మనదిగా భావిస్తాం."[2] భౌతిక, మానసిక యింద్రియాల స్థానంలో ఆస్తి యింద్రియం బైటాయించింది.

ఫలితంగా శ్రమ క్రమంలో గానేక కొంపలో గూడా వస్తువులు మనిషిపై పెత్తనం చలాయిస్తాయి. మనిషి తన ఆసక్తిని వస్తువుల మీద కేంద్రీకరించడం వల్ల మనిషి వాటికి సేవకుడుగా మారుతున్నాడని, అవి కేవలం అతని శ్రమ స్వభావాన్ని, వేగాన్నీ మాత్రమేగాక అతని విశ్రాంతి స్వభావాన్నీ, తీరునూ, యితర వ్యక్తులతో అతని ప్రైవేటు సంబంధాల స్వభావాన్నీ, తీరునూ నిర్దేశిస్తున్నాయని మనిషి గుర్తించడు.

ప్రపంచంలో మానుషకీతిలో పరాయీకరణ తొలగించడమనేది మనిషికి మనిషికి మధ్యగల సంబంధాలలో మార్పు తేవడమేగాక, అతని జీవితంలోని మొత్తం వస్తువు (content) లోనే మార్పు తెస్తుంది.

మార్క్స్ యిలా రాస్తాడు : మనిషి మనిషిగా వుంటాడనుకోండి, ప్రపంచంతో అతని సంబంధం మానుషమైన దనుకోండి- అప్పుడు నువ్వు ప్రేమకు ప్రేమా, విశ్వాసానికి విశ్వాసమూ

1. Karl Marx, "Economic and Philosophic Manuscripts of 1844" Marx. Engels, Collected works, Vol 3. P. P. 324-325.

2. Ibid. P. 300.

వగైరా మార్పిడి చేసుకోవచ్చు. కళను ఆస్వాదించాలంటే నువ్వు కళాసంస్కారంగల వ్యక్తి అయి వుండాలి. యితరులపై ప్రభావం నెరపాలనుకుంటే యితరులకు ప్రేరణ కలిగించి, వారిని ప్రోత్సాహపరచే సామర్థ్యం గల వ్యక్తివై వుండాలి. మనిషితో, ప్రకృతితో నీ సంబంధం ప్రతిదీ నీ సంకల్ప లక్ష్యానికీ, నీ నిజమయిన వ్యక్తిగత జీవితానికీ అనుగుణమయిన నిర్దిష్ట వ్యక్తీకరణగా వుండాలి. నీ ప్రేమకు బదులుగా ప్రేమను రేకెత్తించకుండా నువ్వు ప్రేమిస్తే-అంటే నీ ప్రేమ ప్రేమగా పరస్పర ప్రేమను సృష్టించకపోతే, ప్రేమించే వ్యక్తిగా నీ సజీవ వ్యక్తీకరణ ద్వారా నువ్వొక ప్రేమమూర్తివి కాలేవు. అప్పుడు నీ ప్రేమ నిర్వీర్యమైనది- ఒక దురదృష్టం." [1]

స్వయం సమృద్ధ సంపద విలువ సూత్రంగల బూర్జువా అర్థ శాస్త్రాన్ని మార్క్స్ మానవుని తిరస్కరణను స్థిరంగా బోధించే సిద్ధాంతంగా ముద్ర వేశాడు.

కమ్యూనిస్టు సమాజంలో వస్తుసంపద ఏ రీతిలో వుండాలో అలా తయారవుతుంది. సంపద మనిషి జీవిత లక్ష్యంగా గాక, కేవలం సంపూర్ణ మానవ కార్య కలాపం కొనసాగించడానికి సాధనంగా మాత్రమే తయారవుతుంది. ".... రాజకీయ అర్థశాస్త్ర సంపద పేదరికాల స్థానంలో సుసంపన్న మానవుడు -సుసంపన్న మానవావసరం చోటు చేసుకుంటాయి___" [2]

మార్క్స్ పెట్టుబడి గ్రంథంలో దానికి సంబంధించిన సన్నాహక రచనల్లో ఈ భావాన్ని ఇదేపదే పునరుద్ఘాటిస్తాడు. మనిషి ఉత్పత్తి చేసేదిగాక, మనిషే అత్యున్నత సంపద, సమాజ అత్యున్నత పెట్టుబడి, "వ్యక్తుల అవసరాల సామర్థ్యాల, ఆనందాల ఉత్పత్తి శక్తులవగైరా సార్వత్రికత" [1] అని మార్క్స్ ప్రకటిస్తాడు. కమ్యూనిస్టు సమాజంలో మొత్తం సామాజిక ఉత్పత్తికి మనిషి లక్ష్యం. కాగా, భౌతిక విలువలు అనేవి కేవలం ఈ లక్ష్యం సాధించడానికి అవసరమయిన సాధనం, పరిస్థితి , పునాది మాత్రమే.

వైదొలగినఅంశం (స్వయం పరాయీకరణ), లక్ష్యం వెల్లడించిన తర్వాత, లక్ష్యం వైపు ఏ పద్ధతిలో పురోగమించాలో, పరాయీకరణను ఏ పద్ధతిలో అధిగమించాలో మార్క్స్ రేఖామాత్రముగా చిత్రిస్తాడు. ఈనాటికీ ఈ సమస్య వివిధ దేశాల సామాజిక శాస్త్రవేత్తలకు, మార్క్సిస్టులకు తీవ్ర చర్చనీయాంశంగా వుంది.

---

1. Karl Marx, "Economic and Philosophic Manuscripts of 1844" Marx, Engels, Collected works, Vol. 3. P. 326.

2. Ibid.

1. Karl Marx, Grundrisse der Kritike der Politischen O Konomie (Rohenwurf) 1857-1858, Berlin 1953, L, 387.

పరాయీకరణ రద్దు చేయడమనేది ప్రాథమికంగా ప్రైవేటు ఆస్తి రద్దుచేయడంపై ఆధారపడి వుందనేది మార్క్స్ స్పష్టమయిన, గందరగోళంలేని అభిప్రాయం. ప్రైవేటు ఆస్తి అనేది "పరాయీకృత శ్రమ, ఆర్థిక పరాయీకరణల ఉత్పాదితం. ఫలితం, అవశ్యమయిన పర్యవసానం."[2]

వివిధ రూపాల్లో పరాయీకరణకు సంబంధించిన అన్ని ఛాయలు, అంశాలు (రాజకీయ, మత,తాత్విక నైతికవగైరా) ఆర్థిక పరాయీకరణలో పోగుపడతాయి. ఉత్పత్తిలోగల కార్మికుని బానిసత్వంలో మొత్తం మానవజాతి బానిసత్వం వ్యక్తమౌతుంది. "....బానిసత్వ సంబంధాలన్నీ ఈ సంబంధ సవరణలు, పర్యవసానాలు తప్ప మరేమీకావు."[3] ఇక్కడ మార్క్స్ సమాజ జీవితంలో ఉత్పత్తి సంబంధాలు అగ్రగామి పాత్ర వహిస్తాయనే భావాన్ని అవశ్యంగా సూత్రీకరిస్తున్నాడు.

హెగెల్‌కు అన్నిరకాల పరాయీకరణలూ భావపరాయీకరణగా కనిపించి, ఈ రకమైన పరాయీకరణ మనిషి "చైతన్యంలో" అధిగమించడం సాధ్యమని కూడా భావిస్తాడు. కానీ ప్రపంచంతో తన సంబంధాల బానిస స్వభావంను గుర్తిస్తాడు. కాబట్టి అతని పరాయీకరణ అదృశ్యంకాదు. కాగా, ఇంకా పెరుగుతుంది.

ఈతకొట్టడం నేర్చుకోవాలంటే మనిషి తాను కేవలం ఈత కొడుతున్నట్లు వూహించుకున్నంత మాత్రాన సరిపోదు. స్వేచ్ఛను పొందాలంటే తాను స్వేచ్ఛగా వున్నట్లు భావించినంత మాత్రాన సరిపోదు. "స్వంత ఆస్తి అనే భావాన్ని రద్దు చేయాలంటే కమ్యూనిజం అనే భావం చాలు. ఇది నిజమైన ప్రైవేటు ఆస్తిని రద్దుచేయడానికి నిజమైన కమ్యూనిస్టు చర్య తీసుకుంటుంది'"

"చరిత్ర అందుకు దారితీస్తుందనే" విషయంలో మార్క్స్‌కు సందేహం లేదు. కానీ ఊహాస్వర్గ వాదులు సహజంగా భావించే రీతిలో ప్రైవేటు ఆస్తి వేగంగా, నొప్పిలేకుండా రద్దవుతుందనే భ్రమలతో తనను తాను ఓదార్చుకోడు. ఇది చాలా మొరటైన, సుదీర్ఘ ప్రక్రియ"[2] అనే విషయం ఆయన చారిత్రకదృష్టి ఆయనకు విస్పష్టం చేసింది.

ప్రైవేటు ఆస్తి హఠాత్తుగా మంత్రదండం వూపడంవల్ల ఆవిర్భవించలేదు. ఇది అనేక శతాబ్దాలుగా వివిధ రూపాల్లో అభివృద్ధి చెందుతూ వచ్చింది. దాని అభివృద్ధి యింకా పూర్తికాలేదు. ఇది

2. Karl Marx, "Economic and Philosophic Manuscripts of 1844" Marx. Engels. Collected works. Vol. 3, P. 279.

3. Ibid. P. 280

1. Karl Marx, Economic and Philosophic Manuscripts of 1844" Marx. Engels. Collected works, Vol. 3, P. 313.

2. Ibid.

యిప్పుడు పారిశ్రామిక పెట్టుబడి రూపం సంతరించుకుంటుంది. సమాజ రోమకూపాలన్నింటిలోకి చొచ్చుకొనిపోయి, అది పెత్తనం చెలాయించేంతవరకూ, అత్యంత సార్వత్రిక రూపంలో ఒకప్రపంచశక్తిగా మారినంతవరకూ యిది పెరుగుతూ పోతుంది.

ఈ అభివృద్ధి చెందిన రూపంలో, సంపూర్ణ జీవంతో ప్రైవేటు ఆస్తి తన మృత్యువును, తన వ్యతిరేకశక్తిని-పీడిత, పరాయీకృత పారిశ్రామిక కార్మికుల శ్రమను సృష్టిస్తుంది.

ఈ క్షణం నుండి యిది తన నిర్మూలనవైపు పురోగమిస్తుంది. కాని, దీని పరిపక్వతకు దారితీసిన మార్గమే దీని మృత్యుమార్గం-కమ్యూనిజం స్థాపనలో వివిధ రూపాల్లో, దశల్లో యిది కనిపిస్తుంది.

అమెరికా, ఇంగ్లాండులలో పేదవాళ్ళ కమ్యూన్లను నెలకొల్పడంతో చేసిన ప్రాథమిక పోరాటాలను దృష్టిలో వుంచుకొని మార్క్స్ రుజువు చేసినట్లుగా, మొట్టమొదట సర్వులకు సమానహక్కులనే మొరటు కమ్యూనిజంగా కమ్యూనిజం ప్రత్యక్షమౌతుంది. ఈ "కమ్యూనిజం" ప్రైవేటు ఆస్తికున్న క్రూర స్వభావంపై క్రూర పద్ధతిలో నిరసన వ్యక్తం చేస్తుంది. అప్పటికిదింకా ప్రైవేటు ఆస్తి ద్వారా ఏర్పడిన అసమానతలలో కూడిన ప్రైవేటు ఆస్తి "ప్రభావం కింద" వుండి, ప్రతివాళ్ళను సమానస్థాయికి కుదించాలనుకుంటుంది. (స్త్రీల కమ్యూనిటీ వరకూ) మనిషికీ మనిషికీ మధ్య తేడా కల్పించే ప్రతిదాన్నీ అందరికీ చెందజాలని ప్రతిదాన్నీ ధ్వంసం చేయడానికి ప్రయత్నిస్తుంది.

అందువల్ల "మొరటు, బాలకాసుగది కమ్యూనిజం" మనిషి ప్రతిభ నుండి, శ్రద్ధ మరల్చుకుంటుంది. కార్మికుని పరాయీకృత శ్రమను నిర్మూలించకుండా ప్రతి ఒక్కరినీ కార్మికునిగా మార్చాలనుకుంటుంది.

ప్రతి రంగంలో మనిషి వ్యక్తిత్వాన్ని తిరస్కరించే యీ రకపు "కమ్యూనిజం" అదే సమయంలో "యావత్ప్రపంచ సంస్కృతి, నాగరికతల తిరస్కరణ "చాలా స్వల్ప అవసరాయున్న పేదవాని, కృత్రిమ సరళత్వం దీని ఆదర్శం. ఈ ఆదర్శం, ప్రైవేటు ఆస్తిని దాటిపోవడంలో విఫలం చెందినది మాత్రమేగాక, దాన్ని అందుకోలేకపోయిన "సరళత్వాన్ని" రుజువు చేస్తుంది.

ఈ రకమయిన "కమ్యూనిజం"లో శ్రమకు పెట్టుబడికి మధ్యగల విరుద్ధ ప్రకృతి రద్దు కాదు. శ్రమ (దాని అత్యంత ప్రాథమిక రూపంలో,) ఒక ధాతువుగా ప్రతి మనిషికీ పని కల్పించి, పెట్టుబడి సమాజ అంగీకృత సార్వజనీనతగా, శక్తిగా వుండే ధాతువుగా అవతరిస్తుంది.

మార్క్స్ యీ "మొరటు కమ్యూనిజం"ను "ప్రైవేటు ఆస్తి కున్న క్షుద్రత్వ" వ్యక్తీకరణగా ముద్రవేసు ఈ విమర్శ యీనాటికీదాని సైద్ధాంతిక, ఆచరణాత్మక ప్రాముఖ్యతను నిలబెట్టుకుందనే విషయం గ్రహించడం కష్టంకాదు. తీవ్ర విప్లవ పిడివాదాన్ని, "మానవజాతిసుఖ

పెటడానికి బారకాసుగది పద్ధతులను ప్రేమిస్తూమహోన్నత కమ్యూనిస్టు భావాలనుఅపభ్రంశం చేసి, కించపరిచే వాళ్ళకు వ్యతిరేకంగా పోరాడటానికి ఈ విమర్శ తోడ్పడుతుంది.

ప్రధానంగా భవిష్యత్తునుగూర్చిఆనాటి ఊహాస్వర్గ సోషలిస్టులకు, పెటీబూర్జువా ప్రజాతంత్రవాదులకు విలక్షణమైనకొన్ని భావాలనుమనసులో పెట్టుకొని మార్క్స్ చెప్పే రెండోరూపం యింకా రాజకీయ స్వభావం కోల్పోని కమ్యూనిజం. ఇది ప్రజాస్వామిక మైనది, లేదా నిరంకుశ మైనది. అది ప్రైవేటు ఆస్తికి బందీగా వుండిపోతుంది. దాని అంటువ్యాధి సోకి నట్టిది.

అంతిమంగా, మూడవ రూపం — మానవ సంస్కృతి, నాగరికతల యావత్ సంపదను రక్షించేప్రాతిపదికపై ప్రైవేటు ఆస్తిని "నిశ్చయంగా" అధిగమించడమనేది అన్ని రూపాల్లో పరాయీకరణను నిజంగా నిర్మూలించేదిగా ఈ రూపానికి పూర్వభావిగా వుంటుంది. ఈ కమ్యూనిజం సంపూర్ణంగా అభివృద్ధి చెందిన మానవత్వానికి దీటుగా వుంటుంది. యిది "మనిషికీ-ప్రకృతికీ మధ్య; మనిషికీ, మనిషికీ మధ్య ఘర్షణ నిర్మూలించే సిసలైన పరిష్కారం."[1]

చరిత్ర గమనం యావత్తూ ఈ కమ్యూనిజం సృష్టికి నిజమైన మూలచర్య. దీని భావనాత్మక వునికికి ప్రసవ క్రియ. అందువల్ల ఈ సమస్యకు పరిష్కారం "కేవలం అవగాహనా సమస్య కానేకాదు. కాగా నిజమైన జీవితసమస్య. కేవలం దీన్ని సైద్ధాంతిక సమస్యగా మాత్రమే భావించినందువల్లే ఈ సమస్యను తత్వశాస్త్రం పరిష్కరించలేక పోయింది."[2]

ఒక సంవత్సరం తర్వాత మార్క్స్ తన ప్రఖ్యాత సూక్తిని సూత్రీకరించాడు: "తత్వవేత్తలు పలరకాలుగా ప్రపంచాన్ని కేవలం వ్యాఖ్యానించారు. కాని, దాన్ని మార్చటమనేది అసలు విషయం."[3]

ఆ తర్వాత పదిహేను ఇరవై సంవత్సరాలకు మార్క్స్ తన "Economic and philosophic Manuscripts of 1844" లో వ్యక్తీకరించిన భావాలను అర్థశాస్త్రానికి సంబంధించిన తన రచనల్లో మహా గంభీరంగా, సవివరంగా అభివృద్ధి చేశాడు.

ఈ భావాలు-శ్రమ పెట్టుబడుల విరుద్ధ ప్రకృతి, సరుకుగా కార్మికుడు, సరుకు సంకేతారాధన (fetishism) కార్మికుణ్ణి సజీవయంత్రంగా యంత్రంలో భాగంగా మార్చడం-అనే విషయాలకు సంబంధించినవి. యజమాని మూర్తీభవించిన పెట్టుబడి అవతారంగా, కార్మికుడు మూర్తీభవించిన శ్రమశక్తి అవతారంగా వున్న సరుకు సంబంధాల ప్రపంచంలో

1. Karl Marx. "Economic and Philosophic Manuscripts of 1844" Marx, Engels, Collected works, Vol. 3, P. 296.

2. Ibid P. 302.

3. Karl Marx, "Theses on Feurbach," Marx, Engels, Collected works, Vol. 5, P. 8.

మానవ వ్యక్తిత్వ పరాయీకరణకు చెందిన భావాలివి.

"పరాయీకరణ" అనే తాత్విక భావనకు బదులుగా మార్క్స్ నిర్దుష్టమైన, స్పష్టమైన అర్థశాస్త్ర ధాతువులను ఎక్కువగా వాడాల్సివచ్చింది. కానీ ఇది ఎక్కువగా సాంకేతిక పదజాలానికి సంబంధించిన ప్రశ్నేగానీ, మూలసూత్రానికి సంబంధించినది కాదు.

"The Economic Philosophic Manuscripts of 1844" నూతన ప్రపంచ దృక్పథ అద్భుత రేఖాచిత్రం, ఒక కార్యక్రమ రేఖాచిత్రం. దీన్ని అభివృద్ధిచేసే కృషి మార్క్స్‌కు జీవిత పర్యంతం ప్రధానవ్యాపకమయింది.

ఈ రచనను అసాధారణమైన గతి పట్టింది. దీన్ని సృష్టించిన తర్వాత దాదాపు తొంభై యేళ్ళకు, దీని సృష్టికర్త మరణించిన తర్వాత దాదాపు యాభై యేళ్ళకు ప్రపంచానికి దీని గూర్చి తెలిసింది. కాని, అత్యంత వర్తమాన విషయంపై అప్పుడే రాసినట్లుగా వెనువెంటనే అందరి దృష్టిని అపారంగా ఆకర్షించింది. అప్పటినుండి వివిధ దేశాల్లో "రాతప్రతుల" పైన గుట్టలకొద్దీ గ్రంథాలు ప్రచురితమయ్యాయి. వాటిని గూర్చిన సారస్వత ప్రవాహం నానాటికీ పెరుగుతోంది. వాదోపవాదాలు మరింత తీవ్రతరమవుతున్నాయి. యిది రాసిన క్షణం నుండీ మనం ఎంత ముందుకు సాగితే యిదంత ప్రస్తుత రచనగా కనిపిస్తుంది.

ఇందులో లేవనెత్తిన సమస్యలు మార్క్సిజంపై అత్యంత విభిన్న దృక్పథాల మధ్య — అపభ్రంశ పిడివాద దృక్పథంనుండి అపభ్రంశ-రివిజనిస్టు దృక్పథాలవరకూ — ఘర్షణారంగంగా తయారయ్యాయి.

ఈ రెండు "కొసల్లో" సామాన్యమైనదేదో వుండటం ఆసక్తికరమైన విషయం. యివి రెండూ యిద్దరు మార్క్స్‌ల మధ్య తేడా చూస్తాయి. యువ మార్క్స్, పరిణతి చెందిన మార్క్స్ అయితే ఈ రెండూ విభిన్న పద్ధతుల్లో ఈ పని చేస్తాయి. అపభ్రంశ పిడివాద దృక్పథం యువ మార్క్స్‌ను "సిసలైన" మార్క్స్‌గా అపభ్రంశ రివిజనిస్టు దృక్పథం పరిణతి చెందిన మార్క్స్‌ను "సిసలైన" మార్క్స్‌గా పరిగణిస్తాయి.

ఈ రెండు వైఖరులూ మార్క్సిజంపై వికృత, ఆదిమ భావాన్ని వ్యక్తం చేస్తాయి. మార్క్సిజాన్ని మానసిక జడత్వంవల్ల శుష్క-పాండిత్యపు గిటురాయితో కొలవడం యిందుకు కారణం. కాని "రాతప్రతులు" "పెట్టుబడి" గ్రంథం రెండూ రెండు సిద్ధాంతాలుగా, మొదటిదాన్లో "మానవతావాదం" కేంద్రంగా, రెండవదాన్లో "ఆర్థికవాదం" కేంద్రంగా రెండు సంపూర్ణ తాత్విక వ్యవస్థలుగా పరస్పరం వ్యతిరేకించవు.

ఒకవేళ అవి పరస్పరం వ్యతిరేకిస్తే కేవలం మూలంగా, శిఖరంగా మాత్రమే; ప్రపంచ ప్రసిద్ధమైన ఘటనల నూతన విశ్లేషణా పద్ధతి ఆవిష్కరించిన రచనగా, దాన్ని క్రియలో పెట్టిన రచనగా మాత్రమే; తాత్విక-ఆర్థికరచనగా, ఆర్థిక-తాత్విక రచనగా మాత్రమే.

మార్క్సిజం, దాని మూలపురుషులు నొక్కి చెప్పినట్లుగా, ఒక సిద్ధాంతంగాక ఒక పరిశీలనా పద్ధతి. అందువల్ల వివిధ రచనల నుండి "తయారుగా వున్న" సూత్రీకరణలను వ్యాఖ్యానించడంద్వారా దీన్ని అర్థం చేసుకోలేరు. మార్క్సిజపు సజీవ ఆత్మను చలనంద్వారా, భావాల సృష్టిక్రమం ద్వారా, పరిశీలనా పద్ధతిని నిరంతరం పరిపక్వం చేయడంద్వారా మాత్రమే అర్థం చేసుకోవచ్చు.

శుష్కపాండిత్య సంకుచిత మనస్తత్వం పెట్టుబడి గ్రంథంలోని "మానవతా వాదాన్ని" చూడలేదు. ఎందుకంటే మొత్తం మార్క్స్ వారసత్వంలో ఈ మార్క్స్ రచనకున్న స్థానాన్ని అర్థం చేసుకోలేదు. ఏ మానవాదర్శాలకోసం "ఆర్థిక మానవుని" ఆయన శ్రమించి అధ్యయనం చేశాడో గ్రహించలేదు. తాత్వీకరిస్తూ పగటికలలు గనేవాళ్ళ భావోద్వేగదాతృత్వాన్ని "మానవతావాదం"గా పరిగణించడానికే యిది అలవాటు పడిపోయింది. కాబట్టి మార్క్స్ మానవతావాదాన్ని చూడలేదు.

మరోవంక, యిదే సంకుచిత మనస్తత్వ వ్యాధితో బాధపడే యువ మార్క్స్ విమర్శకులు మార్క్సిజం రూపొందటంలో రాతప్రతులకున్న అపార ప్రాముఖ్యత ఏమిటో విలువ కట్టడానికి అసమర్థులు. "పరాయీకరణ", "మానవతావాదం" అన్న మాటలు వినిపించినప్పుడు యివి వాస్తవంగా మార్క్స్ భావాలేనా? అని వాళ్ళు అనుమానంగా చీదరించుకుంటారు. వాళ్ళు అర్థం చేసుకోగల్గినది ఒకే ఒక మార్క్సిస్టు ప్రాథమిక ప్రణాళికాబద్ధ వ్యాఖ్యానం. ఈ వ్యాఖ్యానపు ప్రొక్రూస్టియన్ పరుపు*తో మార్క్స్ భావ సంపదను చుటలేరు. అందువల్ల వాళ్ళు "స్వచ్ఛమైన", "కల్మషమైన" మార్క్స్‌ల మధ్య "పరిణత", "అపరిణత" మార్క్స్‌ల మధ్య తేడా చూడటానికి ప్రయత్నిస్తారు.

మార్క్స్ "అపభ్రంశ కమ్యూనిజం"గా ముద్రవేసిన దాని ప్రయత్నం. అప్రయత్న సిద్ధాంతవేత్తలు భావించినట్లుగా మార్క్స్ మానవతావాదం ఒక సైద్ధాంతిక ఉద్రేకం కాదు. మానవతావాదం మార్క్సిజానికొక ఉపాంగం కాదు—అది మార్క్సిజం గుండెకాయ. మానవజాతి సుఖసంతోషాలకోసం పోరాడే లక్షలాది మందికి మార్క్సిజాన్ని ప్రపంచ దృక్పథంగా చేసే శక్తి, ప్రాణాన్నిచ్చే అంతర్గత జీవధార.

"రాతప్రతుల్లో"నే కనిపించిన మార్క్స్ మానవతావాదం మానుష శాస్త్రానికి ఫుయర్‌బాఖ్ చెప్పుకునే వసితనపు క్షమాపణ లాంటిదిగాదు. యిద్దరు వ్యక్తుల ప్రేమను, ప్రకృతిలో వారి సాన్నిహిత్యాన్ని ఆరాధనీయం చేయడం కాదు. వ్యక్తిపై అన్ని రూపాల హింసను, అన్నిరూపాల వ్యక్తి పీడనను

*ప్రొక్రూస్టిజ్—గ్రీకు పౌరాణిక గాథలో ప్రొక్రూస్టిజ్ అనే ఒక రాక్షసుడు దారినపోయే యాత్రీకులను పట్టుకొని మంచానికి కట్టేవాడు. మనిషి కురచయితే మంచానికి సరిపోయేలా మనిషిని సాగలాగేవాడు, పొడుగయితే కాళ్ళు తెగగొట్టి మంచం పొడవుకు సరిపెట్టేవాడు. దానికి ప్రొక్రూస్టియన్ మంచం అనే పేరొచ్చింది—అను.)

అనహ్యించుకోవడంద్వారా అంకితమైన సిద్ధాంతం; యిది సామాజిక పరివర్తనకు అవసరమైన అపారశక్తిని తనలో దాచుకున్న సిద్ధాంతం.

The Economic and Phdilo-sophic Manuscripts of 1844 (Deutsch-Franze' sische Jahrbucher లో దానికి సంబంధించిన యితర వ్యాసాలు) మార్క్స్ ఆత్మిక వికాస దశకు సంబంధించినవి. దీనికి ముందు రాసినవి మార్క్సిజానికి ఆయన మార్గాన్ని వర్ణించేవి కాగా, ఆ తర్వాత రాసినవి మార్క్సిజం అభివృద్ధిని, దాని అన్ని భాగాల్లో, ప్రధానంగా, రాజకీయ అర్థశాస్త్రంలో అభివృద్ధిని వర్ణిస్తాయి.

1844 ను శాస్త్రీయ ప్రపంచ దృక్పథం జనియించిన సంవత్సరంగా పేర్కొనవచ్చు. అయితే ఈ ప్రపంచ దృక్పథం రూపొందడం ఏ సంవత్సరంలో పూర్తయిందో చెప్పలేము. మార్క్స్, ఎంగెల్స్‌లు మరణించేంత వరకూ రాసిన అన్ని రచనల్లో యిది కొనసాగింది. ఈ రోజు కూడా కొనసాగుతోంది. మానవ సమాజం వున్నన్ని నాళ్ళు కొనసాగుతూనే వుంటుంది.

("మహా మేధావిప్లువ" గ్రంథం నుండి)



# కార్మికవర్గం - విప్లవశక్తి

మార్క్స్ - ఎంగెల్స్

బూర్జువా వర్గం యే ఆయుధాలతో ఫ్యూడలిజంను నేలకూల్చిదో ఆ ఆయుధాలు యిప్పుడు బూర్జువా వార్గం మీదికే యెత్తబడినాయి.

కానీ, బూర్జువా వర్గం సృష్టించింది, తన్నే నాశనం చేయగల ఆయుధాలను మాత్రమే కాదు; ఆ ఆయుధాలనుధరించే మనుషులనుకూడా అది సృష్టించింది. ఆ మనుషులే ఆధునిక కార్మికవర్గం.

బూర్జువా వర్గం యే నిష్పత్తిలో లభివృద్ధి ఔతుందో, అంటే పెటుబడి యే నిష్పత్తిలో అభివృద్ధి ఔతుందో, ఆ నిష్పత్తిలోనే అభివృద్ధి ఔతుంది ఆధునిక కార్మికవర్గం—యెన్నాళ్ళు పని దొరుకుతుందో అన్నాళ్ళు మాత్రమే జీవించే కార్మికుల వర్గం—యెన్నాళ్ళు తమ శ్రమ (యజమానుల) పెటుబడిని వృద్ధి చేయగలదో అన్నాళ్ళు మాత్రమే పని దొరికే కార్మికుల వర్గం. తమ్మ తాము యేరోజుకారోజు అమ్ముకోవలసిన యీ కార్మికులు (మార్కెట్‌లోని) యితర వర్తకపు సరుకు లన్నిటిలాగే తాము ఒకసరుకు. అందువలన వాళ్ళు పోటీలోని యెగుడు దిగుడు లన్నిటికీ, ధరల హెచ్చుతగ్గుల కన్నిటికీ గురి ఔతారు.

యంత్రాలు విస్తృతంగా ఉపయోగంలోకి రావడంవల్లా, శ్రమ విభజనవల్లా కార్మికుల శ్రమలో వ్యక్తిగత ప్రత్యేకత అనేది పూర్తిగా అంతరించింది. అందువలన కార్మికునికి పనిలో యే విధమైన ఆకర్షణా లేకుండా పోయింది. కార్మికుడు యంత్రానికి తోకఐనాడు. అతనికి వుండవలసిందల్లా పనిలో చాకచక్యం మాత్రమే—అత్యంత సరళమైందీ, గానుగెద్దు పనిలాగఅత్యంత విసుగు పుట్టించేదీ, అత్యంత సులభంగా అలవడేదీ ఐన చాకచక్యం మాత్రమే. కాబట్టి, ఒక కార్మికుని ఉత్పత్తి చేయడానికి అయ్యే ఖర్చు దాదాపు ఆ కార్మికుడు పొట్ట పోసుకోడానికీ, కార్మిక సంతతిని కనడానికీ కావలసిన తిండి తిర్థాలకు మాత్రమే పరిమితమౌతుంది. కానీ, ఒక సరుకు ఖరీదు దాని ఉత్పత్తి ఖర్చుకు సమానంగా వుంటుంది; అనగా (కార్మికుని) శ్రమ ఖరీదు దాని ఉత్పత్తి ఖర్చుకు సమానంగా వుంటుంది. కాబట్టి పని యెంత అసహ్యంగా వుంటే అంతగా కూలి తగ్గిపోతుంది. అంతేకాదు, యంత్రాల వాడకమూ, శ్రమ విభజనా పెరిగేకొద్దీ, అదే నిష్పత్తిలో కార్మికుని మీద పడే శ్రమభారంకూడా పెరుగుతుంది—పనిగంటలు పెంచడం, లేక అదే

కాలంలో కార్మికునితో యెక్కువపని చేయించుకోవడం, లేక యంత్రాల వేగం యెక్కువ చేయడం మొదలైన పద్ధతుల ద్వారా కార్మికునిమీద పడే శ్రమభారం పెరుగుతుంది.

ఆధునిక పరిశ్రమ వచ్చిన తర్వాత, పాతకాలపు పితృస్వామిక యజమానులు నడిపే చిన్న కార్ఖానాలుపోయి, వాటి స్థానంలో పారిశ్రామిక పెట్టుబడి దారు నడిపే బ్రహ్మాండమైన ఫాక్టరీలు వచ్చినాయి. గుంపులు గుంపులుగా ఫాక్టరీలోపల చేరిన కార్మిక సమూహాలను సైనిక దళాల మాదిరీ సంఘటిత పరుస్తారు. కార్మిక సైన్యంలోని యీ సిపాయిలమీద, అచ్చం సైన్యంలోలాగే, సార్జంట్లూ, కమాండర్లూ మొదలైన అధికార్లు తరతమ శ్రేణిలో వుంటారు. ఈ కార్మికులు కేవలం బూర్జువా వర్గానికి బూర్జువా రాజ్యానికీమాత్రమే బానిసలు కాదు; వీళ్ళు ప్రతి రోజూ, ప్రతి గంటా యంత్రానికి బానిసలు, తనిఖీ చేసే మేస్త్రీకి బానిసలు, అన్నిటినీమించి బూర్జువా యజమానికి బానిసలు. ఈ నిరంకుశత్వం లాభమే తన ఏకైక లక్ష్యమని యెంత బాహాటంగా ప్రకటించుకుంటుందో అంత నీచంగానూ, అంత ద్వేషపాత్రంగానూ, అంత కసి కలిగించేదిగానూ తయారౌతుంది.

ఆధునిక పరిశ్రమలు అభివృద్ధి ఆయ్యే కొద్దీ కార్మికుని నైపుణ్యానికీ, శరీర బలానికీ ప్రాముఖ్యం తగ్గిపోతుంది; నైపుణ్యమూ, శరీరబలమూ అనవసరమయ్యే కొద్దీ యజమానులు పురుషులను తొలగించి స్త్రీలను పనిలో పెట్టుకుంటారు. సమాజంలో స్త్రీ పురుష భేదాన్నిబట్టీ, వయోభేదాన్నిబట్టీ వుండే ప్రత్యేకతలు కార్మిక వర్గానికి యిక యెంతమాత్రమూ అన్వయించవు. అందరూ పనిచేసే సరుకులే: యే సరుకుకైనా ఖరీదు చెల్లించవలసిందే; వయోభేదాన్ని బట్టీ,స్త్రీ పురుష భేదాన్నిబట్టీ ఆ సరుకుల ఖరీదులో తేడావుంటుంది—అంతే.

పగలంతా ఫాక్టరీ యజమానిచే దోపిడీ చేయబడిన కార్మికునికి ఆ సాయంత్రంతో దోపిడీ అంతంకాదు. సాయంత్రం కూలిడబ్బులు చేతిలో పడిన వెంటనే అతన్ని యితర బూర్జువా దోపిడీదార్లు — యింటి యజమానీ, అంగడివాడూ, వడ్డీ వ్యాపారస్థుడూ, మొదలైనవాళ్ళు మూటడిస్తారు.

మధ్య తరగతిలోని కిందివర్గవాళ్ళు—చిన్న చిన్న వ్యాపారస్థులూ, దుకాణదారులూ, రిటైరైన వర్తకులూ, చేతి పనులవాళ్ళూ, రైతులూ—వీళ్ళందరూ క్రమక్రమంగా కార్మికవర్గంలోకి దిగజారిపోతారు. దీనికి కొంతకారణం యేమంటే వీళ్ళ దగ్గర వున్న స్వల్ప పెట్టుబడి ఆధునిక పరిశ్రమలు నడపడానికి చాలదు; పెద్ద పెట్టుబడిదార్లతో పోటీ పడలేక వీళ్లు దివాలా తీస్తారు. మరికొంత కారణం యేమంటే కొత్త ఉత్పత్తి పద్ధతులు అమల్లోకి వచ్చినందువల్ల చేతి పనుల వాళ్ళ ప్రత్యేక వృత్తి నైపుణ్యం యెందుకూ కొరగాకుండా పోయింది. ఈ విధంగా అన్ని తరగతుల ప్రజలనుండి కొత్త వాళ్ళు వచ్చి కార్మికవర్గంలో కలుస్తుంటారు.

కార్మిక వర్గ అభివృద్ధిలో వివిధ దశ లున్నాయి. పుట్టుకతోనే ప్రారంభమౌతుంది బూర్జువావర్గంతో దాని పోరాటం. మొదట కార్మికులు విడివిడిగా, యెవని పాటికివాడు, పోరాడుతారు; తరువాత ఒక ఫ్యాక్టరీలోని వాళ్ళందరూ కలిసి పోరాడుతారు; ఆ తరువాత ఒకే స్థలంలో ఒకే రకమైన ఫాక్టరీలలో పనిచేసే వాళ్ళందరూ కలిసి పోరాడుతారు. ఈ పోరాటాలన్నీ తమను ప్రత్యక్షంగా దోపిడీ చేసే బూర్జువా యజమానులు అనే వ్యక్తులమీద జరుగుతాయి. బూర్జువా ఉత్పత్తి నియమాలమీద గాక, ఉత్పత్తి సాధనాల మీదనే కార్మికులు దాడి చేస్తారు; తమ శ్రమతో పోటీచేసే విదేశీ సరుకులను ధ్వంసం చేస్తారు, యంత్రాలను ముక్కలు ముక్కలు చేస్తారు. ఫాక్టరీలను దగ్ధం చేస్తారు. యెప్పుడో అంతరించిపోయిన మధ్య యుగా ల నా టి వృత్తిపనివారి హోదాను పునరుద్ధరించడానికి బలప్రయోగంతో ప్రయత్నం చేస్తారు.

ఈ దశలో కార్మికులు ఒకరికొకరికి సంబంధంలేకుండా దేశ మంతటా వెద జల్లబడినట్లు వుంటారు. తమలో తమకు గల పోటీ మూలంగా యెక్కడికక్కడ చీ లి వు ం టా రు. యెక్కడైనావాళ్ళు ఐక్యమై కొంతవరకు సంఘటితమైన బృందాలుగా యేర్పడితే, అది వాళ్ళతో పుట్టిన ఐకమత్యంవల్ల కలిగిందేమీకాదు, బూర్జువావర్గంలోని ఐకమత్యంవల్ల కలిగిందే; బూర్జువావర్గం తన రాజకీయ స్వప్రయోజనాలు సాధించుకోడానికి మొత్తం శ్రామికవర్గాన్ని కదిలించవలసి వుంటుంది; ఆ దశలో, కొంతకాలం పాటు, దాని కలా కదిలించేశక్తివుంటుంది కూడా. అనగా, ఆ దశలో కార్మికులు పోరాడేది తమ శత్రువులతో కాదు, తమ శత్రువుల శత్రువులతో-నిరంకుశ రాచరికపు అవశేషాలతోనూ, భూస్వాముల తోనూ, పారిశ్రామికులు కాని బూర్జువాలతోనూ[3], పెటీ బూర్జువా వర్గంతోనూ. ఆ విధంగా, ఆ దశలో మొత్తం చరిత్ర గతి అంతా బూర్జువా వర్గం చేతుల్లో సాంద్రీకరింపబడి వుంటుంది; ఆ పోరాటంలో లభించే ప్రతి విజయమూ బూర్జువా వర్గానికి విజయంగా వుంటుంది.

కానీ, పరిశ్రమలు అభివృద్ధి అయ్యే కొద్దీ కార్మికుల సంఖ్య పెరగడమేగాక, కొన్ని స్థలాలలో వాళ్ళు విశేషంగా సాంద్రీకృతమౌతారు; వాళ్ళబలం పెరుగుతుంది. ఆబలం వాళ్ళకు మరింతగా అనుభూతమౌతుంది. యంత్రాలు వచ్చి కార్మికుల పనిలోని విలక్షణాలన్నిటినీ మాపుమాపే కొద్దీ, దాదాపు ప్రతిచోటా కార్మికుల వేతనాలను (తరతమ భేదాలు లేని) ఒకే హీనస్థాయికి దిగలాగే కొద్దీ, కార్మికులలోని భిన్న ప్రయోజనాలూ, భిన్న జీవన పరిస్థితులూ (తరతమ భేదాలు కోల్పోయి) అంతకంతకూ సమానమౌతాయి. బూర్జువాలలో పోటీలు పెరగడంవల్లా, తత్ఫలితంగా యేర్పడే వాణిజ్య సంక్షోభాలవల్లా కార్మికుల వేతనాలు మరింత యెగుడు దిగుడులకు గురౌతాయి. యంత్రాలలో అంతకంతకూ వేగంగా జరిగే నిరంతరాభివృద్ధివల్ల వాళ్ళ జీవనాధారాలు అంతకంతకూ నమ్మకంలేనివౌతాయి. కార్మికులకూ బూర్జువాలకూ మధ్య వ్యక్తిగతంగా జరిగే ఘర్షణలు

రానురాను రెండు వర్గాలమధ్య జరిగే పోరాటాలుగా పరిణమిస్తాయి. అప్పుడు బూర్జువాలకు వ్యతిరేకంగా కార్మికులు ట్రేడ్ యూనియన్ల సమ్మేళనాలు యేర్పరచుకోవడం ప్రారంభిస్తారు; తమ వేతనాల స్థాయిని నిలబెట్టుకోడానికి అందరూ యేకమౌతారు; అప్పుడప్పుడు జరిగే యీ తిరుగుబాట్లకు ముందుగానే సంసిద్ధంగా వుండటానికి శాశ్వత సంఘాలు యేర్పరచుకుంటారు. యీ పోరాటాలు అక్కడక్కడా కొట్లాటలుగా పరిణమిస్తాయి. అప్పుడప్పుడు కార్మికులకు విజయం లభిస్తుంది; కానీ అది తాత్కాలికమే. ఆ యుద్ధాలవల్ల వాళ్ళకు కలిగే నిజమైన లాభం తక్షణ ఫలితాలలో లేదు; నిత్యం విస్తరించే కార్మికవర్గ ఐక్యతే నిజమైన లాభం. ఆధునిక పరిశ్రమలు సృష్టించిన వారా రవాణా సాధనాలు వివిధ ప్రాంతాలలోని కార్మికులకు పరస్పర సంబంధాలు కల్పించి, కార్మికవర్గ ఐక్యతకు తోడ్పతాయి. సరిగా యీ పరస్పర సంబంధమే కావలసి వుండింది. ఏక స్వభావం కలిగిన అసంఖ్యాక స్థానిక పోరాటాల నన్నిటినీ కలిపి రెండు వర్గాలమధ్య జరిగే ఏకైక దేశ వ్యాప్త పోరాటంగా రూపొందించడానికి. కానీ, ప్రతివర్గ పోరాటమూ ఒక రాజకీయ పోరాటమే. యిక ఆ ఐక్యత - దరిద్రపు రహదారులుగల మధ్య యుగాల్లో పట్టణ పౌరులు (burghers) సాధించడానికి కొన్ని శతాబ్దాలు పట్టిన ఆ ఐక్యత —— ఆధునిక కార్మికులు, రైల్వేల మూలంగా కొద్ది సంవత్సరాలలో సాధిస్తారు.

కార్మికులు ఒక వర్గంగా సంఘటిత పడటమూ తత్పర్యవసానంగా ఒక రాజకీయ పార్టీగా సంఘటిత పడటమూ అందరి కార్మికులకు వాళ్ళలో వాళ్ళకే వున్న పోటీవల్ల నిరంతరం తలక్రిందు లౌతూ వుంటుంది. కానీ, అది మళ్ళీ పైకి లేస్తుంది; మరింత బలంగా, మరింత స్థిరంగా, మరింత ప్రచండంగా ముందుకు సాగుతుంది. బూర్జువా వర్గంలోని చీలికలను ఉపయోగించుకొని అది కార్మికుల ప్రత్యేక ప్రయోజనాలను ప్రభుత్వ శాసనాలు గుర్తించేటట్టు చేస్తుంది. ఈ విధంగా యింగ్లండులో పది గంటల పని బిల్లు[34] పాసయింది.

మొత్తంమీద పాత సమాజంలోని వర్గాలమధ్య జరిగే పరస్పర సంఘర్షణలు అనేక విధాలుగా కార్మిక వర్గ అభివృద్ధికి తోడ్పడతాయి. బూర్జువా వర్గం నిరంతర యుద్ధంలో చిక్కుకొని వుంటుంది-మొదట ఫ్యూడల్ ప్రభువర్గంతో యుద్ధం, తరువాత బూర్జువా వర్గంలోనే పరిశ్రమల అభివృద్ధి వల్ల నష్టపడేవాళ్ళతో[35] యుద్ధం, మొదటి నుండి చివరిదాకా విదేశ బూర్జువా వర్గాలతో యుద్ధం. ఈ యుద్ధాలన్నిటిలోనూ కార్మికవర్గ సహాయం అర్థించక తప్పదని బూర్జువావర్గం గుర్తిస్తుంది. ఈ విధంగా అది కార్మికవర్గాన్ని రాజకీయ రంగంలోకి లాగుతుంది. తన్మూలంగా, బూర్జువా వర్గమే తన రాజకీయ విద్యనూ, సాధారణ విద్యనూ కార్మిక వర్గానికి నేర్పుతుంది. అనగా, బూర్జువా వర్గంతో యుద్ధం చేయడానికి కావల

సిన ఆయుధాలను కార్మికవర్గానికి బూర్జువా వర్గమే అందిస్తుంది.

అంతేకాదు. యింతకుముందు చెప్పి నట్లు, పరిశ్రమలు పురోగమించేకొద్దీ, పాలకవర్గాలలోని కొన్ని ఉపవర్గాలే[6] మొత్తంగా కార్మికవర్గంలోకి తోయబడు తాయి; లేదా, కనీసం, ఆ ఉపవర్గాల జీవిత విధానానికి ప్రమాదకర పరిస్థితి ఏర్పడుతుంది. యీ ఉపవర్గాలు కూడా కార్మికవర్గానికి నూతన విజ్ఞానమూ, నూతన ప్రగతి లక్షణాలూ సరఫరా చేస్తాయి.

చివరి అంశం యేమంటే : వర్గ పోరాటం అవోయిహో తేలిపోయే గడియ సమీపించినప్పుడు, పాలక వర్గంలో సాగుతున్న విచ్ఛిత్తి ప్రక్రియ-నిజానికి పాత సమాజం అంతటా సాగుతున్న విచ్ఛిత్తి ప్రక్రియ-యెంత స్పష్టమైన, యెంత ప్రచండమైన రూపం ధరిస్తుం దంటే, పాలకవర్గంలోనే కొద్దిమంది తమ వర్గంతో సంబంధాలు తెంచుకొని వచ్చి విప్లవ వర్గంతో కలుస్తారు-భవి ష్యత్తును శాసించే విప్లవ వర్గంతో. అనగా, గతంలో యే విధంగా ఫ్యూడల్ ప్రభువర్గానికి చెందిన ఒక భాగం విడి పోయి వచ్చి బూర్జువా వర్గంతో కలి సిందో, అదే విధంగా యిప్పుడు వర్గానికి చెందిన ఒక భాగం విడిపోయి వచ్చి కార్మికవర్గంతో కలుస్తుంది- ముఖ్యంగా మొత్తం చారిత్రక గతి నంత టినీ సిద్ధాంతరీత్యా అవగాహన చేసు కోగల స్థాయికి చేరుకున్న బూర్జువా సిద్ధాంతవేత్తలలో ఒక భాగం.

ఈనాడు బూర్జువా వర్గానికి ముఖా ముఖిగా నిలబడిన వర్గాలన్నిటిలోకీ కార్మికవర్గం ఒక్కటే నిజమైన విప్లవ వర్గం. తక్కిన వర్గాలు ఆధునిక పరి శ్రమల ప్రభావంవల్ల క్షీణించి క్షీణించి చివరకు అదృశ్యమౌతాయి. కార్మిక వర్గం ఆధునిక పరిశ్రమల ప్రత్యేక సృష్టి. ఆధునిక పరిశ్రమల అతిముఖ్య సృష్టి. ("కమ్యూనిస్టు ప్రణాళిక" నుండి)



# కమ్యూనిస్టు కరపత్రం

## సమీక్ష – కంభంపాటి సత్యనారాయణ (1935)

(మార్క్స్, ఎంగెల్స్‌లు రాసిన "కమూనిస్టు ప్రణాళిక" 1934-1935లో తెలుగులో అనువదించబడి మొదటిసారిగా ముద్రించబడింది. అనువాదకులు "సామ్యవాది", సమీక్షకులు కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణ. దీనిలో వాడిన కొన్ని పదాల ఆనాటి అర్థం వేరు. నేడు వేరు దీనిని పాఠకులు గమనించగలరు.

(సం. కమ్యూనిజం)

గ్రంథకర్తలు:మార్క్స్, ఎంగెల్స్ అనువాదకుడు "సామ్యవాది" ప్రకాశకులు ఎలమర్రు ఆదర్శ గ్రంథమండలి. వివరాలు క్రౌన్ అక్టేవో సైజు. 109 పేజీలు వెల. 0-4-0

కమ్యూనిజం, సోషలిజం, సామ్యవాదం మొదలయిన వివిధరాజకీయ, ఆర్థిక మతాలను గురించి ఆంధ్ర దేశంలో చర్చలు జరుగుతున్నాయి. ఇట్టి సమయంలో కమ్యూనిజం యొక్క మూల సిద్ధాంతాలకు పితామహుడైన కార్ల్ మార్క్స్ చేతనూ, అతని సహచరుడైన ఫ్రెడరిక్ ఎంగెల్సుచేతనూ రచించబడ్డ ఈ కరపత్రం ప్రతి ఆంధ్రుడూ చదివి తీరాలి. రెండో విషయం. వివిధ మతాలను ప్రజలకు తెలియజేయడంలో కొంతమంది తెలిసిగాని,తెలియకగాని,ప్రజలను తప్పుత్రోవలో నడిపించే ఉద్దేశంతో గాని—నిజమయిన కమ్యూనిస్టు సిద్ధాంతాలను కప్పిపుచ్చి తమ స్వంత ఉద్దేశాన్ని ప్రచారం చేయడం జరగవచ్చు. ఇట్టి మోసం ఆంధ్రులకు జరగకుండా మార్క్స్, ఎంగెల్సులచే స్వయంగా వ్రాయబడ్డ కమ్యూనిస్టు కరపత్రాన్ని ఆదర్శ గ్రంథమండలివారు ప్రచురించి ఆంధ్ర దేశానికి అమోఘమయిన సేవ చేయగలిగారు. సరియైన సమయానికి ఈ చిన్న పుస్తకాన్ని ఆంధ్రులకందజేసినందులకు గ్రంథమండలి వారు ప్రశంసాపాత్రులు.

ఈ కరపత్రం నాలుగు అధ్యాయాలలో వ్రాయబడివుంది. మొదటి అధ్యాయంలో ధనాఢ్య వర్గానికి శ్రామిక వర్గానికి జరుగుతూన్న పోరాటం చారిత్రిక దృష్టితో వివరించబడింది. సృష్ట్యాది నుంచి ఇప్పటివరకు మానవజాతియొక్క చరిత్రంతా వర్గ కలహాల చరిత్ర అని

స్పష్టంగా నిరూపించబడిందిపీడించే వర్గం పీడించబడే వర్గం అనే రెండు తెగలలోకి జనులు చేరుతూ వచ్చారు. క్రమక్రమముగా మధ్య యుగాలనాటి ఉత్పత్తి విధానాలు మారి 19-వ శతాబ్దములో బ్రాహ్మాండమైన పారిశ్రామిక విప్లవం సంభవించింది. పూర్వకాలపు పనిముట్లూ పూర్వకాలపు సాంఘిక వ్యవస్థలూ తారుమారై పోయాయి. కాని, వర్గ స్పర్ధలు రూపుమాపబడ నేలేదు. పైగా యీ పారిశ్రామిక విప్లవంవల్ల నూతన వర్గాలూ, నూతన ఆయుధాలు సృష్టించబడ్డాయి. ప్రస్తుతపు సమాజం రెండు పెద్ద తెగలుగా చీలిపోయి ఉంది. ఆరెండే ధనాఢ్య వర్గం, శ్రామిక వర్గం. మానవేతిహాసంలో యిదివరకెన్నడూ సమాజం ఇంతస్పష్టంగా రెండు చీలికల కింద కాలేదు. ఇంతేకాదు. ఈ ధనాఢ్యవర్గం క్రమక్రమంగా ప్రతిదేశంలోనూ రాజ్యాధికారాన్ని వశపరచుకొంటూ శాసనాలు తనలాభంకొరకు చేసుకొంటూ వచ్చింది. ఈ ధనాఢ్యవర్గం యొక్క హయాంలో మానవునికీ, మానవునికీ వుండే సబంధం డబ్బు సంబంధమేగాని మిగతా సంబంధం లేనేలేనట్టు మన నిత్యజీవితంలో కనపడుతూ వుంది. అయితే అనేకవేల సం॥ రాలలో సృజించబడలేని ఉత్పత్తి శకులను సృష్టించినది ఈ ధనాఢ్యవర్గమే! కాని, తాను నిర్మించిన యీ ఉత్పత్తి విధానాలను తనవశమందు ఉంచుకోలేక పోతూంది ఈ ధనాఢ్యవర్గం. అందువల్లనే యీ ధనకాటకాలూ, ఈ ఆర్థిక క్షోభలూలో ఈ అధికోత్పత్తిఅత్యవసరమయిన ఆహారపదార్థాలను సముద్రాలలో కలపడాలున్నూ. ఈ పెట్టుబడి వ్యాపారాలకు లసంఖ్యాకులయిన శ్రామికవర్గం అవసరం. యంత్రాంగాలలోనూ యితర స్థలాలలోనూ శ్రామికులు గుమికూడవలసి వచ్చింది. ఎంత ఎక్కువగా పెట్టుబడి వృద్ధి చెందిందో అంత ఎక్కువగానూ రోజు కూలిమీద ఆధారపడే శ్రామికవర్గ (Proletariate) వృద్ధి పొందింది. ఈ ధనాఢ్య శ్రామిక వర్గాలకు రెండింటికీ పోరాటం సంభవిస్తూ హోరా హోరీగా యుద్ధాలు జరుగుతున్నాయి. ఇట్టి కలహాలలో తరచు కార్మికులే ఓడిపోతూ ఉంటారు. కాని వీటివలన కార్మికులకు నూతన శక్తి, నూతన ఐక్యత, నూతన వికాసం కలుగుతూ ఉంటుంది. అంతేకాదు. శ్రామికునికి రక్షించుకోడానికి ఆస్తిలేదు. భార్యాబిడ్డలతో సంబంధం బహు తక్కువ. "శ్రామికులు తమ సంకెళ్ళు పోగొట్టుకొనేది మరేమిలేదు. జయించే దానికి ఒక ప్రపంచ మంతా ఉంది." ఈ ధైర్యంతో వాళ్ళ పోరాటాలు సాగిస్తారు. సరియైన సమయం కనిపెట్టి శ్రామికులు సాంఘిక విప్లవం లేవదీస్తారు. బలవంతంగా ధనాఢ్య వర్గంయొక్క రాజ్యాధికారాన్ని ఊడబెరికి తాము సింహాసనం అధిష్టిస్తారు. కనుక యీ విధంగా ధనాఢ్య వర్గం తనను నాశనంజేసే జాతిని కూడా సృష్టించుకున్న దన్నమాట! "ధనాఢ్య ప్రాబల్యం ఎప్పటికేనా మలమలమాడి శ్రామికుల విజయ పతాకం ఎగురవలసిందే" నని మార్క్సు, ఏంగెల్సు ఘంటాపథంగా చాటారు.

రెండో అధ్యాయంలో శ్రామిక వర్గానికీ కమ్యూనిస్టులకూ ఉండే సంబంధం చర్చించబడింది. వివిధ దేశాలలో జరిగే కార్మికుల జాతీయ పోరాటాలలో, ఎంచేసినా, అన్నిదేశాల శ్రామికులకూ రావలసిన లాభాలనే చూస్తూ, అవే ప్రథమస్థానం అలంకరించేటట్లు చేయడం కమ్యూనిస్టులవిధి. సర్వశ్రామిక సౌభ్రాతృత్వమే కమ్యూనిస్టులు బోధించాలి. వారందర్నీ ఒకే వర్గానికి చెందేటట్లు చేయడం, ధనాఢ్య వర్గాన్ని అధికారంనుంచి పడగొట్టడం, శ్రామికులు రాజ్యాధికారాన్ని లాక్కొనేటట్లు చేయడం, యివి కమ్యూనిస్టు పక్షం యొక్క ముఖ్యోద్దేశాలు. రాజ్యాధికారం సంపాదించిన తర్వాత ధనాఢ్య వర్గం యొక్క పెట్టుబడినీ, అధికారాన్నీ, శ్రామికవర్గం క్రమక్రమంగా ఊడబెరకాలి. ఊడబెరకి తన అధికారం కిందకు భూమి, యంత్రాంగారాలు మొదలయిన ఉత్పత్తి సాధనాలన్నింటినీ తీసుకొస్తుంది. తీసుకొచ్చి సమస్త ఉత్పత్తి శక్తుల్నీ అభివృద్ధి చేస్తుంది. ఈ కార్యకలాపం నడపటానికి బలమైన నియంత అవసరం. కనుక ప్రభుత్వంయొక్క సర్వాధికారాలూ శ్రామికవర్గపు ప్రతినిధుల కీయబడుతాయి. ఈ ప్రతినిధులే కమ్యూనిస్టు పార్టీలో ముఖ్యసభ్యులై ఉంటారు. కొంతకాలం ఈ నియంతృత్వం సాగినమీదట ధనాఢ్యవర్గం యొక్క ప్రాబల్యం పూర్తిగా నశిస్తుంది. నశించిన తరువాత యిక రాజకీయాధికారం అవసరం ఉండదు. క్రమక్రమంగా శ్రామికవర్గ ప్రభుత్వం దిగజారిపోతుంది. (The State withers away) మానవ సంఘం అంతా సమాన ప్రతిపత్తిగల సోదర బృందంగా మారుతుంది. వర్గాలు నశించి పోతాయి. వాటితో వర్గకలహాలూ మాయమౌతాయి. భూలోకమే స్వర్గతుల్యంగా అవుతుంది! కరపత్రంయొక్క ఉపరివాక్యాలివి!

"కమ్యూనిస్టులు తమ భావాలనూ ఆదర్శాలనూ దాచేదానికి నిరాకరిస్తారు. వారు తమ ఆదర్శాలు, బలవంతంగా ప్రస్తుతముండే సామాజిక పరిస్థితులను నాశనంచేయందే పొందబడ జాలవని బహిరంగంగా చాటుతారు. కమ్యూనిస్టు విప్లవాన్నిగూర్చి ఆలోచిస్తూ శాసకవర్గాలు గడగడ కంపిస్తాయి! శ్రామికులు తమ సంకెళ్ళను తప్ప పోగొట్టుకొనేది మరేమీలేదు. జయించేదానికి ఒక ప్రపంచమంతా ఉంది. అన్నిదేశాలందలి కార్మిక జనమూ! ఏకముగండు!!"

పుస్తకంయొక్క తర్జుమాలు భాష కొంత నారికేళ పాకంగా ఉన్నా Ruskin మహాశయుడు చెప్పినట్లు, బంగారాన్ని పైకి తీయడానికి ఏ విధంగా గనులుత్రవ్వి అనేక కష్టాలు పడవలసి ఉందో, అదే విధంగా ఒక ఉద్గ్రంథంలోని ఉన్నతాభిప్రాయాల్ని తెలుసుకొనేటందుకు కొంత శ్రమపడ్డం అవసరం.

—కం. స.

(1935 ఫిబ్రవరి 15 వ తేదీ చిత్రగుప్తనుండి)

# ఆధునిక సమాజం కార్మిక వర్గం

డాక్టరు ఎ. గాల్కిన్

ఆధునిక సమాజంలో కార్మిక వర్గ స్థానంపై నేడు తీవ్ర చర్చ జరుగుతున్నది. సమాజ పరిణామంలో దాని పాత్ర ఏమిటి ? కార్మికవర్గ విప్లవశక్తి ఉడిగి పోతున్నదా ? అన్న ప్రశ్నలు చర్చలలో వస్తున్నాయి.

కార్మికవర్గానికి వ్యతిరేకంగా బూర్జువా సనాతన సిద్ధాంత వేత్తలు నిష్ఫలలు కక్కుతున్నారు. కార్మికులను ఇతర కష్టజీవులను "అథమవర్గం" వారుగా పరిగణిస్తున్నారు. కార్మికులను సమాజ వ్యతిరేక శక్తులుగా కూడా వారు పరిగణిస్తున్నారు. వారి మితిమీరిన కోర్కెలు, అసమర్థత కారణంగానే పెట్టుబడిదారీ ప్రపంచంలో నేడు తీవ్ర సంక్షుభిత పరిస్థితి ఏర్పడుతున్నదని వాదిస్తున్నారు. లిబరల్ బూర్జువా సిద్ధాంతవేత్తలు కార్మిక వర్గం మృత్యుముఖంలో ఉన్నదని ప్రచారం చేస్తున్నారు. చరిత్రలో కార్మిక వర్గం తన పాత్రను నిర్వర్తించడం లేదని గత కొద్ది సంవత్సరాలుగా వీరు వల్లించుతున్నారు. ఆధునిక, సామాజిక, ఆర్థిక పరిణామంలో కార్మిక వర్గం ఒక వర్గంగా హరించుకు పోతున్నదని, పెట్టుబడిదారీ సమాజంలో ఇది ఒకఅంతర్భాగం అవుతున్నదని, రాజకీయంగా, సైద్ధాంతికంగా దీనికి ఏ పాత్ర లేదని, పెద్ద ప్రచారం చేస్తున్నారు.

ఈ రెండు రకాల సిద్ధాంత ధోరణులు వాస్తవ పరిస్థితిని ప్రతిబింబించటం లేదు. పైగా వాస్తవాలకు భిన్నగా ఉన్నాయి. సమాజ పరిణామాన్ని వీరు చూడ నిరాకరిస్తున్నారు. చరిత్రలో వస్తున్న మలుపును చూడలేక పోవడం దురదృష్టకరం.

చరిత్రలో జరిగిందేమిటి. 1789-1793 జరిగిన ఫ్రెంచి బూర్జువా మహా విప్లవంలో అప్పుడే అవతరిస్తున్న కార్మిక వర్గం విప్లవశక్తిగా తన వంతు పాత్రను నిర్వర్తించింది. కార్మిక వర్గ పాత్ర లేకుండా నాటి యూరోపులో సామాజిక రాజకీయ మార్పులను మనము చూడగలిగే వారమా ? 1850 కాలంలో ఫ్రాన్సులో, జర్మనీలో, బ్రిటనులో కార్మికవర్గ తిరుగుబాట్లు జరిగినాయి. ముఖ్యంగా 1848-49 సంవత్సరాలలో ఫ్రాన్సు, ప్రష్యా, ఆస్ట్రియా, ఇటలీ, బెల్జియం తదితర దేశాలలో కార్మికవర్గం నాటి విప్లవాలలో ప్రముఖ పాత్ర వహించింది. కార్మిక వర్గం తన హక్కులకే కాక ఇతర శ్రమజీవుల ప్రయోజనాల కొరకు కూడా పోరాడింది. కార్మికవర్గం తన స్వంత ట్రేడ్ యూనియన్‌లను

నిర్మాణం చేసుకుంది. తన స్వంత రాజకీయ పార్టీలను రూపొందించుకొంది. అనేక కొత్త పోరాట పద్ధతులను సృష్టించుకొంది. "ఉదాహరణకు సమ్మె పోరాటం. తన స్వంత రాజకీయ సిద్ధాంతాన్ని రూపొందించుకోవడమే కాకుండా లక్షలాది మంది మనస్సులపై తన గాఢ ప్రభావాన్ని కలిగించింది.

1917 అక్టోబరు మహా విప్లవానికి చోదకశక్తి కార్మిక వర్గం. 1918-19లో వచ్చిన బూర్జువా విప్లవాలకు కార్మిక వర్గం నాయకత్వం వహించింది. ఉదాహరణకు జర్మనీ, ఆస్ట్రియా, హంగరి. రెండవ ప్రపంచ యుద్ధానంతరం, తూర్పు యూరప్‌లో ఆసియా దేశాలలో వచ్చిన సోషలిస్టు విప్లవాలకు నాయకత్వం వహించింది కార్మికవర్గం. కార్మిక వర్గం పోరాటాలవల్లనే వయోజన ఓటింగ్‌హక్కు నేడనేక దేశాల్లో అమలులో వుంది. 8 గంటల పని దినాన్ని బూర్జువా వర్గం అంగీకరించవలసి వచ్చింది. ఇప్పుడు కొన్ని దేశాలలో వారానికి 40 గంటలపని అమలులో ఉన్నది. నిరుద్యోగ భృతి, వృద్ధాప్య పెన్షన్లను కార్మికవర్గం సాధించుకొన్నది. ఈ ప్రజాతంత్ర హక్కుల సాధనకు కార్మికవర్గం ఎంతో మూల్యాన్ని చెల్లించవలసి వచ్చింది. కార్మికవర్గ పోరాట వత్తిడివల్లనే పెట్టుబడిదారీ దేశాలలో వైద్య విద్యాసౌకర్యాలను పొందగలుగుతున్నారు. కొంత మేరకైనా కార్మికవర్గం తన జీవన పరిస్థితులను మెరుగుపర్చుకో కలిగింది. సామాజిక మార్పులకై అది పోరాడుతూనే తనంతట తానుగా కూడా మారుతున్నది. దాని గుణాత్మక సంఖ్య పెరుగుతున్నది. పెట్టుబడిదారీ దేశాలలో నేటికొక పెద్ద శక్తి.

గుణాత్మక సంఖ్య పెరగడంతో కార్మికవర్గ చట్రంలో కొన్నిమార్పులు వస్తున్నాయి. ఒక దశలో చేతితో పని చేసే కార్మికుల సంఖ్య తగ్గింది. మరొక దశలో వ్యవసాయ కార్మికుల సంఖ్య సాపేక్షికంగా తగ్గింది. వాణిజ్య రంగంలో కార్మికుల సంఖ్య పెరిగింది. మేధో శ్రమ చేసే కార్మికుల సంఖ్య సాపేక్షికంగా పెరుగుతున్నది. ఆధునిక ఉత్పత్తి శక్తుల పురోగతి కారణంగా కార్మికవర్గ అంగ నిర్మాణంలో ఈ మార్పులు వస్తున్నాయి.

అదే సందర్భంలో కార్మికవర్గ మేధో పరిణతి పెరుగుతున్నది. కార్మికుల యొక్క సాధారణ విద్యా ప్రమాణాలు కొంతమేరకు పెరగటం, వృత్తిపరమైన విజ్ఞానం పురోగతి చెందటం, నూతన వృత్తులు రావటం, రాజకీయ సమస్యలను పరిష్కరించటంలో కార్మిక వర్గం పాత్ర పెరగటం, సిద్ధాంత జ్ఞానం క్రమేణా పెరగటం - ఇవన్నీ కార్మిక వర్గ మేధో పరిణతి పెరుగుతున్న దనటానికి తార్కాణాలు.

కార్మికవర్గంలో వస్తున్న ఈ మార్పులు కారణంగా, దాని విప్లవ సామర్థ్యం క్షీణించుట లేదు. ఇది ముఖ్యమైన విషయం. కాకపోతే ఇవి భిన్న భిన్న రూపాలలో దాని విప్లవకర శక్తి సామర్థ్యాలు వ్యక్తమవుతూ వుంటాయి.

నేటి పరిస్థితి ఏమిటి. బాగా అభివృద్ధి చెందిన దేశాలలో పరిస్థితి ఒక నూతన దశకు చేరుకుంది. ఆర్థిక రాజకీయ రంగాలలో సంక్షోభ తీవ్రత ఎక్కువవుతున్నది. కార్మిక వర్గం నేడు ఒక సరిహద్దు రేఖను చేరుకున్నది. అత్యంత ముఖ్యమైన నిర్ణయం తీసుకోకుండా కార్మికవర్గం దానిని దాటలేదు. కనీస జీవన ప్రమాణాలను ఆదేశాలలో కాపాడకుండా, కనీస ఉత్పత్తి రేటును సాధించకుండా ఆ సమాజం జీవించగలదా? ఆధునిక బూర్జువా వర్గం దీనికి సమాధానం ఇవ్వలేకపోతున్నది. అనేక దేశాలలో కార్మికవర్గ హక్కులపై దాడి జరుగుతున్నది. వారి జీవన ప్రమాణ శాఖలపై దాడి జరుగుతున్నది. వీటికి వ్యతిరేకంగా కష్టజీవుల ప్రతిఘటన పెరుగుతున్నది. సామాజిక ఉద్రిక్తత ఎక్కువ అవుతున్నది. కొన్ని దేశాలలో వీటి కారణంగానే వామపక్ష వైఖరిని కలిగియున్న శక్తులు ప్రభుత్వంలోకి వచ్చాయి. ఫ్రాన్సు, గ్రీసు, స్వీడన్, స్పెయిన్ దేశాలలో వచ్చిన మార్పుల అర్థం ఏమిటి?

అయితే పెట్టుబడిదారీ దేశాలలో కార్మికవర్గం తన అంతిమ తీర్పు యింకా యివ్వవలసి ఉంది. దోపిడికి వ్యతిరేకంగా, ఉత్పత్తిలో అరాకచత్వానికి వ్యతిరేకంగా అట్టి తీర్పు ఇస్తుందనటానికి అన్ని సూచనలు ఉన్నాయి.



# మార్క్స్ గురించిన స్మృతులు

అన్నింటా అతను అసలైన మనిషి. అలాంటి వాన్ని మళ్ళీ చూడబోను.
("హామ్లెట్ నాటకం")

పాల్ లాఫార్గ్

నేను కారల్ మార్క్స్‌ను మొదటి సారి 1865 ఫిబ్రవరిలో కలుసుకున్నాను. 1864 సెప్టెంబర్ 28న లండన్‌లోని సెంట్ మార్టిన్స్ హాలులో జరిగిన సమావేశంలో, మొదటి ఇంటర్నేషనల్ స్థాపించబడింది. పారిస్‌లో వున్న శైశవ సంస్థ అభివృద్ధి గురించిన వార్తను మార్క్స్‌కు అందజేయడానికి 1865 ఫిబ్రవరిలో నేను పారిస్ నుండి లండన్‌కు పోయినాను. బూర్జువా రిపబ్లిక్‌లో ఇప్పుడు సెనేటర్‌గావున్న శ్రీ తొలెన్ నన్ను పరిచయం చేస్తూ జాబు రాసి ఇచ్చినాడు.

నాకప్పుడు 24 యేండ్లు. ఆ మొదటి కలయిక నాలో కలిగించిన ముద్ర నాకు శాశ్వతంగా జ్ఞాపకముంటుంది. మార్క్స్ అపుడు అనారోగ్యంగా వుంటినాడు ఆ సమయంలో ఆయన 'క్యాపిటల్ మొదటి భాగం' మీద కృషి చేస్తూ వుండినాడు. అది *1867* లో ప్రచురించబడింది. తన కృషిని పూర్తి చేయలేననే భయం వుండింది ఆయనకు. అనుక, యువకులు తనను చూడటానికి వస్తే సంతోషించే వాడు.

"నా తర్వాత కమ్యూనిస్టు ప్రచారం కొనసాగించే వాళ్ళను నేను తయారు చేయాలి." అనేవాడు ఆయన.

శాస్త్ర విజ్ఞానంలోనూ, పౌర జీవితంలోనూ రెండింటిలోనూ ఒకేసారి నాయకులుగా వుండగల అరుదైన వ్యక్తులలో ఒకడు కార్ల్ మార్క్స్. ఈ రెండు పార్శ్వాలు ఆయనలో ఎంత గాఢంగా ఏకమైనాయంటే, ఆయనలోని విద్వాంసుని, సోషలిస్టు యోధుని లెక్కలోకి తీసుకుంటే తప్ప ఆయనను అర్థం చేసుకోలేము.

ఏ శాస్త్రవిజ్ఞానమైనా శాస్త్రవిజ్ఞానం కొరకే అభివృద్ధి చెందాలని మార్క్స్ అభిప్రాయం. తన పరిశోధనలచే ఎలాంటి పరిణామాలు ఏర్పడినప్పటికీ శాస్త్రజ్ఞుడు గందరగోళపడ కూడదు. జీవితం నుండి, సమకాలికుల రాజకీయ పోరాటంనుండి, పౌర జీవితంనుండి దూరంగా ఎడంగా నిలబడే శాస్త్రజ్ఞుడు కేవలం పరిశోధనాలయంలోనో, గ్రంథాలయంలోనో వుండి తనపని నిర్వర్తించు కొనటం చాలా నీచమని మార్క్స్ అభిప్రాయం.

"శాస్త్రి విజ్ఞానం స్వార్థపూరిత భోగం కారాదు" అనేవాడు ఆయన.

"శాస్త్ర విజ్ఞాన కృషికి అంకితం కాగల అదృష్టవంతులు తమ జ్ఞానాన్ని మానవ సేవకు అర్పించడంలో ప్రథములుగా వుండాలి"

"మానవుల కొరకు కృషి చేయడం" అనేది ఆయన అభిమాన సుడికారాల్లో ఒకటి.

శ్రామికవర్గాల దాదులపట్లమార్క్సుకు ప్రగాఢమయిన సానుభూతి ఉండినప్పటికీ ఆయనకు కమ్యూనిస్టు లభిప్రాయాలు కలిగించింది. మమతా పూర్వక కారణాలు కాదు, చరిత్ర, అర్థశాస్త్రాల అధ్యయనమే. నిష్పాక్షికుడైన వ్యక్తి ఎవరైనా, స్వప్రయోజనాలు, వర్గ దురభిప్రాయాలు వుండకుండావుంటే ఎవరైనా ఇవే అభిప్రాయాలకు విధిగావచ్చి తీరాలని మార్క్సు నమ్మించాడు.

కాని, నిరాధారమయిన అభిప్రాయం ఏది లేకుండా మానవ సమాజ ఆర్థిక రాజకీయ లభివృద్ధిని అధ్యయనంచేస్తూ, మార్క్సు రచనలు చేసింది యెందుకంటె, తన పరిశోధనా ఫలితాలను ప్రచారంచేసే ఉద్దేశం, ఆనాటి వరకు ఊహాస్వర్గ మేఘాలలో దారి తప్పిన సోషలిస్టు ఉద్యమానికి కృతనిశ్చయంతో శాస్త్రీయ ప్రాతిపదికను చేకూర్చే ఉద్దేశం తప్ప మరేమి కాదు.

సమాజం మీద రాజకీయ, ఆర్థికనాయకత్వం సాధించిన వెంటనే కమ్యూనిజం స్థాపించే చారిత్రక కర్తవ్యం గలకార్మిక వర్గం దిగ్విజయాన్ని పెంపొందించడానికి మాత్రమే ఆయన తన అభిప్రాయాలను ప్రచారం చేసినాడు.

మార్క్సు తన కార్యకలాపాలు తన జన్మదేశానికి పరిమితం చేయలేదు.

"నేను ప్రపంచ పౌరుని, నేను ఎక్కడవుంటే అక్కడ కార్యశీలినిగా వుంటాను" అనేవాడు ఆయన నిజంగానే, పరిస్థితులు, రాజకీయ హింసలు ఆయన్ని ఏ దేశానికి తరిమినా ఫ్రాన్సుగాని, బెల్జియంగాని, ఇంగ్లండ్ గాని— అక్కడ అభివృద్ధి ఐన రాజకీయ ఉద్యమాలలో ఆయన ప్రముఖ పాత్ర వహించాడు.

అయినా, మేయిట్‌లను పార్క్ రోడ్డులోని ఆయన పఠనాగారంలో నేను మొదట చూసింది నిర్వివాదు. నిరుపమాన సోషలిస్టు ఆందోళనా కారునికాదు— శాస్త్రవేత్తను, సోషలిస్టు భావనానికి అయిన ఆయని అభిప్రాయాలను తెలుసుకోడానికి నాగరిక ప్రపంచపు నలుమూలల నుండి పార్టీ కామ్రేడ్లు వచ్చే కేంద్రం ఆ పఠనాగారం (గ్రంథాలయం).

మార్క్సు ఆత్మిక జీవితంలో సన్నిహితత్వం కలగాలంటే ముందు ఆ చారిత్రాత్మక గదిని తెలుసుకోవాలి.

ఆ గది రెండవ అంతస్తులో వుండింది. పార్కువైపు వుండిన పెద్ద కిటికీ గుండా వెలుతురు ప్రసరించేది. కిటికీకి ఎదురుగా, పొయ్యికి ఇరువైపులా వున్న గోడలను ఆనుకొని వున్న బీరువాల నిండా పుస్తకాలు, పై కప్పుదాకా పేర్చిన వార్తాపత్రికలు, రాతప్రతులు వుండినాయి. పొయ్యికి ఎదురుగా, కిటికీకి ఒకవైపున, రెండు మేజాలమీద కాగి

తాలు, పుస్తకాలు, వార్తాపత్రికలు దొంతులు దొంతులుగా వుండినాయి.

గది మధ్యలో, మంచి వెలుతురులో, ఒక చిన్న సాదా డెస్కు (3 × 2 అడుగులు), ఒక కొయ్య కుర్చీ వుండినాయి. కుర్చీకి, పుస్తకాల బీరువాకు మధ్య, కిటికీకి ఎదురుగా ఒక లెదర్‌సోఫా వుండింది. అందులో మార్క్స్ అప్పుడప్పుడు పండుకొని విశ్రాంతి తీసుకునేవాడు. పొయ్యిగూడుమీద మరికొన్ని పుస్తకాలు, సిగార్లు, అగ్గిపుల్లలు, సిగార్ పెట్టెలు, పేపర్‌వెయిట్లూ, మార్క్స్ భార్య బిడ్డలవీ, విల్‌హెల్మ్ వొల్ఫ్‌వీ, ఫ్రెడరిక్ ఎంగెల్సువీ ఫోటోలు వుండినాయి.

మార్క్స్ ఎక్కువగా ధూమపానం చేసేవాడు. ఆయన ఒకసారి నాతో ఇలా అన్నాడు: "ఈ 'పెట్టుబడి'ని రాస్తూ తాగిన సిగార్ల ఖర్చు కూడా నాకు ఈ గ్రంథం ద్వారా రాదు."

ఆయన అగ్గిపుల్లలు మరీ ఎక్కువగా ఖర్చు చేసేవాడు. పైపు, లేక సిగార్ వెల్చడం ఆయన తరుచుగా మరిచిపోయి, దాన్ని తిరిగి అంటించుకోడానికి అగ్గిపెట్టెలు విపరీతంగా ఖాళీ చేసేవాడు.

ఆయన తన పుస్తకాలనూ, కాగితాలను ఎవరూ మట్టసంగా, —చిందర వందరగా అంటె దాగుంటుంది— పెట్టడానికి అంగీకరించేవాడు కాదు. పైకి మాత్రమే అవి చిందర వందరగా వున్నట్టు కనిపించేవి. నిజానికి, ప్రతిదీ నిర్దిష్ట స్థానంలో వుండేది—

ఆయనకు అవసరమైన పుస్తకంగాని, నోట్‌బుక్కుగాని సులభంగా అందుకోడానికి వీలుగా, సంభాషణల మధ్యలో కూడ తాను అప్పుడు చెప్పిన విషయాన్ని గాని, అంకెను గాని తరుచుగా పుస్తకం ఎత్తి అందులో చూపించేవాడు. ఆయనా, ఆయన *పఠనాగారం (గ్రంథాలయం) ఏకఖండం*. తన శరీరాంగాలు ఎంతగా ఆయన అదుపులో వుండేవో, తన పుస్తకాలు, కాగితాలు అంతగా ఆయన అదుపులో వుండేవి.

పుస్తకాలు సర్దిపెట్టడంలోని అందం ఆయనకు అక్కరలేదు. వేరు వేరు సైజులో సంపుటాలు ఒకదాని ప్రక్కన మరొకటి నిలబెట్టబడి వుండేవి. వాటిని సైజునుబట్టికాక, విషయాలను బట్టి ఒక పద్ధతిలో పెట్టుకునేవాడు.

పుస్తకాలు ఆయనకు *మానసిక పరికరాలు—భోగ వస్తువులు* కావు. "అవి నా దాసులు, నా ఇష్ట ప్రకారం నాకు సేవ చెయ్యాలి." అనేవాడు ఆయన. పుస్తకం సైజును, బైండింగ్‌ను, కాగితం రకాన్ని, ప్రింటును ఆయన పట్టించుకునేవాడు కాదు. ఆయన పేజీల మోట్లు మడిచేవాడు. మార్జిన్‌లో పెన్సిల్‌తో గుర్తులు పెట్టేవాడు. పంక్తులు పంక్తులే కింద గీతలు గీసేవాడు. పుస్తకాలమీద ఆయన ఎప్పుడూ ఏమీ రాసేవాడు కాదు. కాని, ఒకోసారి, రచయిత మరీ అతిగా పోయిన చోట, ఆశ్చర్యార్థకమో, ప్రశ్నార్థకమో పెట్టకుండా వుండలేకపోయేవాడు.

ఆయన కింది గీతల పద్ధతి ఏ పుస్తకంలోనైనా ఆయనకు కావలసిన ఘట్టం సులభంగా దొరికేటట్టు చేసేది. నోటు బుక్కులలో రాసుకున్నవి, పుస్తకాలలో

కింద గీతలు గీసిన ఘట్టాలు అనేక సంవత్సరాల తర్వాత మళ్ళీ చదివే అలవాటు ఆయనకు వుండేది తద్వారా, అవి ఆయన మనస్సులో తాజాగా వుండేవి.

ఆయనకు అసాధారణమైన, విశ్వసనీయమైన జ్ఞాపకశక్తి వుండింది. హెగెల్ సలహా ననుసరించి, తనకు తెలియని విదేశ భాషలోని కవిత్వాన్ని కంఠస్థం చేయడంద్వారా. ఆయన ఆ జ్ఞాపకశక్తిని చిన్నప్పటి నుంచి పెంపొందింపచుకున్నాడు.

ఆయనకు హైనె, గేటే, కవిత్వం నోటికి వచ్చు. తన సంభాషణల్లో తరచు వాళ్ళను ఉటంకించేవాడు. యూరోపియన్ భాషలన్నిటిలోనూ వున్న కావ్యాలు ఆయన ఎక్కువగా చదివేవాడు.

ప్రతి సంవత్సరం ఆయన ఎస్కిలస్ (సుప్రసిద్ధ పురాతన గ్రీకు నాటక కర్త) రచనలు మూల గ్రీకు భాషలో చదివేవాడు. ఎస్కిలస్, షేక్స్పియర్ మానవజాతి ప్రసాదించిన అత్యంత ప్రతిభావంతులైన నాటక కర్తలుగా ఆయన భావించినాడు. షేక్స్పియర్ రచనలన్నింటిని ఆయన అధ్యయనం చేసినాడు. షేక్స్పియర్‌పట్ల ఆయనకు గల గౌరవం అపారమైనది. ఆయన నాటకాలోలని అతి చిన్న పాత్రను ఆయనకు తెలుసు.

మార్క్స్ కుటుంబ మంతటికీ ఆ ఇంగ్లీషు మహా నాటకకర్త ఒక ఆరాధ్య దైవం. ఆయన ముగ్గురు కూతుళ్ళు ఆయన రచనల్లో అనేకం నోటికి వచ్చు.

1848లో, అప్పటికే తాను చదవగలిగిన ఇంగ్లీషు భాషలో తనజ్ఞానాన్ని పరిపూర్ణం చేసుకోవాలనుకొని, ఆయన షేక్స్పియర్ సొంత నుడికారాలు నన్నిటిని వెదకి వర్గీకరణ చేసినాడు. తనకు మంచి అభిప్రాయం వుండిన విలియం కాబెట (ఇంగ్లీషు రాజకీయవేత్త, పత్రికా రచయిత, ఇంగ్లీషు రాజకీయ వ్యవస్థలో ప్రజాతంత్రం కోసం పోరాడిన వాడు 1762-1835) వాదోప వాదాత్మక రచనలలో కొన్ని శ్రద్ధగా అధ్యయనం చేసినాడు.

డాంటె రాబర్ట్ బర్న్స్ ఆయన అభిమాన కవుల్లో చేరిన వాళ్ళు ఆయన కూతుళ్లు స్కాటిష్ కవి బర్న్స్ వ్యంగ్య రచనలు, గేయ కథలు చదివినా, పాడినా ఆయన ఎంతో ఆనందంగా వినేవాడు.

ప్యారిస్ మ్యూజియం డైరెక్టరయిన కువ్యే విజ్ఞాన శాస్త్రాల్లో నిర్విరామంగా కృషిచేసేవాడు. ఆయనకు మ్యూజియంలో సొంత ఉపయోగార్థం కొన్ని గదులుండేవి. ప్రతి గదిలోను ఒక్కొక్క రంగానికి పరిమితమై, దానికి అవసరమైన పుస్తకాలు, పరికరాలు [illegible] మైనవి వుండేవి ఆయనకు ఒకరకమైన పనిలో అలసట కలిగితే, పక్కగదిలోకి వెళ్ళి మరొక రకమైన పనిలో నిమగ్నుడయ్యేవాడు. ఇలా మానసిక వ్యాపకం మార్చడమే ఆయనకు విశ్రాంతి.

మార్క్స్ కూడ కువ్యే లాగ అలసట లేకుండ పని చేసేవాడు. కాని, ఆయనకు వివిధ పఠనాగారాలు (గ్రంథాలయాలు) ఏర్పరచుకొనే శక్తి లేదు. ఆయన గదిలో అటూ ఇటూ నడవడం ద్వారా విశ్రాంతి తీసుకునేవాడు. వాకిలినుండి కిటికీదాకా గదినేల అరిగిపోయింది. గడ్డి

సువాసంలో కాలిబాటలాగ స్పష్టంగా కన
పడుతూ.

అప్పుడప్పుడు ఆయన సోఫాలో పండు
కొని ఏదైనా నవల చదువుతుండేవాడు.
ఒకసారి రెండు మూడు నవలలు ఒకటి
మార్చి ఒకటి చదివేవాడు. డార్విన్‌లాగ
నవలలంటే ఆయనకు ప్రీతి. 18వ
శతాబ్ది నవలలు ఆయనకు ఇష్టం.
ముఖ్యంగా ఫీల్డింగ్ రాసిన "టామ్
జోన్స్" బల్‌దా కాక్, చార్లెస్ లెవెర్,
అలెగ్జాండర్ డ్యూమాసీనియర్, వాల్టర్
స్కాట్ మొదలైన అధునిక నవలా
కారుల రచనలు మార్క్స్‌కి చాలా
ఇష్టం. స్కాట్ నవల "పాల్ మరణం"
ఆయన దృష్టిలో గొప్ప రచనాఖండం.
సాహసకృత్యాలు, హాస్యము గల కథలు
ఆయనకు బాగా ఇష్టం.

నవలాకారు లందరిలోనూ సెర్వాం
టిస్‌ను, బాల్జాక్‌ను మిన్నగా ఆయన ఎంచే
వాడు.

"డాన్ క్విక్సోట్"ను ఆయన
మాసిపోతున్న మధ్యయుగ వీరత్వపు
మహాకావ్యంగా పరిగణించాడు. విల
యిత్తుతున్న బూర్జువా ప్రపంచంలో ఆ
వీరత్వపు సద్గుణాలకు వెక్కిరింతలు,
చీదరింపులు ఎదురైనాయి. ఆయన బాల్
జాక్‌లు ఎంతగా మెచ్చుకున్నాడంటే, తన
అర్థశాస్త్ర గ్రంథం ముగిసిన వెంటనే
బాల్జాక్ బృహద్గ్రచన "మానవ ప్రహ
సనం" మీద ఒక సమీక్ష రాయాలని
కోరిక వుండింది. ఆయన దృష్టిలో బాల్జాక్
తన కాలపు చరిత్రకారుడు మాత్రమే
కాదు, భవిష్యద్దర్శనంలో వ్యక్తిత్వాలను
సృష్టించినవాడు, ఆ వ్యక్తిత్వాలు లూయి
ఫిలిప్ రాజు కాలంలో పిండ రూపంలో
వుండి, అతని మరణం తర్వాత, 3వ
నెపోలియన్ కాలంలో గాని పూర్తిగా
వికసించలేదు.

మార్క్స్‌కు అన్ని యూరోపియన్
భాషలు చదవనూ వచ్చు. మూడు—
జర్మన్, ఫ్రెంచి, ఇంగ్లీషు భాషల్లో
రాయను వచ్చు. భాషాప్రవీణులు మెచ్చు
కునేటట్టు "జీవిత పోరాటంలో పరాయి
భాష ఒక ఆయుధం" అనే నానుడిని
పదే పదే చెప్పడం ఆయనకు ఇష్టం.

భాషల విషయంలో ఆయన ప్రజ్ఞా
వంతుడు. ఆ ప్రజ్ఞ ఆయననుండి ఆయన
కూతుర్లకు సంక్రమించింది. ఆయన 50
ఏండ్ల వయస్సులో రష్యన్‌భాష నేర్చు
కోవడం ప్రారంభించినాడు. ఆయనకు
తెలిసిన ఆధునిక, ప్రాచీన భాషల్లో దేని
తోనూ ఆ భాషకు దగ్గర సంబంధం లేక
పోయినా, ఆరు నెలల్లో ఆయన ఆ
భాష ఎంత బాగా నేర్చుకున్నాడంటే,
రష్యన్ కావ్యాలు, నవలలు, కథలు
చదివి ఆనందించేవాడు. రష్యన్ రచ
యితలు పూష్కిన్, గొగోల్, ష్చెద్రీ
న్‌లు ఆయనకు ఇష్టం. ఒక అధికార
వర్యాప్త పత్రాలను చదవ గలగడానికి
ఆయన రష్యన్ భాష అధ్యయనం చేసి
నాడు—ఆ పత్రాలు రాజకీయ విషయాలు
వెల్లడించినందున, రష్యన్ ప్రభుత్వం
వీటిని మూసిపెట్టి వుంచింది. సన్నిహిత
మిత్రులు ఆయనకు ఆ పత్రాలు సంపా
దించినారు. పశ్చిమ యూరపులో వాటిని
చదివిన అర్థశాస్త్రవేత్త నిశ్చయంగా
ఆయన ఒక్కడే.

కవులు, నవలాకారులు కాక, మార్క్సు భౌతికంగా విశ్రాంతి తీసుకునే అసాధారణ పద్ధతి మరొకటి వుండింది-గణితశాస్త్రం. దాని మీద ఆయనకు ప్రత్యేకమైన అభిమానం. బీజగణితం ఆయనకు నైతిక ఆశ్వాసం కూడ సమకూర్చేది. అత్యంత బాధామయమైన సంఘటనలు చాలా ఆయన జీవితంలో వున్నాయి. ఇటువంటి సందర్భాలలో బీజగణితంలో తలదాచుకునేవాడు. ఆయన భార్య చివరి జబ్బులో ఆయన తన మామూలు శాస్త్రీయ కృషిలో నిమగ్నుడు కాలేక పోయినాడు భార్య బాధ ద్వారా తనకు కలిగిన హృదయ భారాన్ని విసరించుకోడానికి గణితశాస్త్రంలో మునిగిపోవడం ఒక్కటే ఆయనకుంటిన మార్గం ఆ నైతిక బాధాకాలంలో ఆయన ఇన్‌ఫినిటెసిమల్ కాల్క్యులస్ మీద ఒక రచన చేసినాడు. నిపుణుల అభిప్రాయంలో అది గొప్ప శాస్త్రీయ విలువగలది. ఆయన సమీకృత రచనల్లో అది ప్రచురింపబడుతుంది. ఉన్నత గణిత శాస్త్రంలో అత్యంత తర్కబద్ధమూ, అత్యంత సులభమూ అయిన రూపంలో పరిస్పరాత్మక గతి కనపడుతుందని ఆయన అభిప్రాయం. ఏ విజ్ఞానశాస్త్రమైనా గణిత శాస్త్రాన్ని ఉపయోగించుకోవడం నేర్చుకున్నదాక నిజంగా అభివృద్ధికానట్లే అని ఆయన అభిప్రాయపడినాడు.

మార్క్సు గ్రంథాలయంలో వెయ్యికి పైగా గ్రంథాలు వుండినాయి. ఆయన జీవిత పర్యంతం సాగిన పరిశోధనా కాలంలో జాగ్రత్తగా సేకరించినవి అవి అయినా అవి చాలక ఆయన బ్రిటిష్ మ్యూజియంకు అనేక సంవత్సరాలు క్రమబద్ధంగా పోయేవాడు. ఆ మ్యూజియంలోని గ్రంథ సముదాయాన్ని ఆయన బాగా మెచ్చుకునేవాడు.

మార్క్సు వ్యతిరేకులు కూడ ఆయన విస్తృత, గంభీర పాండిత్యాన్ని ఒప్పుకోక తప్పేదికాదు-ఆయన ప్రత్యేక రంగమైన అర్థశాస్త్రంలోనే కాదు, చరిత్రలోనూ, తత్వశాస్త్రంలోనూ, సకల దేశాల సాహిత్యంలోను కూడ.

మార్క్సు రాత్రిపూట చాల పొద్దుపోయిందాక మేలుకునేవాడు. అయినప్పటికీ, ఆయన వుదయం ఎనిమిది, తొమ్మిది గంటల మధ్య నిద్రలేచి, బ్లాక్ కాఫీ తాగి, వార్తపత్రికలు చదివి, తరవాత తన పఠనాగారంలోకి పోయేవాడు. అక్కడ ఆయన తెల్లవారు జామున రెండు, మూడు గంటల దాక పని చేసుకునేవాడు. భోజనానికి మాత్రమే పని ఆపేవాడు.

వాతావరణం బాగుంటె, సాయంత్రం పూట హాంప్‌స్టెడ్‌హీథ్ షికారు వెళ్ళేవాడు. పగటి పూట అప్పుడప్పుడు సోఫాలో పండుకొని గంటో, రెండు గంటలో నిద్ర పోయేవాడు. యవ్వనంలో ఆయన తరుచు రాత్రంతా మేలుకొని పని చేసుకునే వాడు.

మార్క్సుకు పని మీద అనురక్తి. పనిలో ఆయన ఎంతగా లీనమైపోయేవాడంటె, తరుచుగా భోజనం మాట మరచిపోయేవాడు. తరుచు ఎన్నోసార్లు పిలిచిన తర్వాత గాని ఆయన భోజనశాలకు వచ్చేవాడుకాదు. చివరి ముద్ద

తినీ తినకముందే మళ్ళీ పఠనాగారంలో వుండేవాడు.

ఆయన చాలకొద్దిగా తినేవాడు. ఆయనకు ఆకలి మాంద్యం కూడ వుండేది. దాన్ని అధిగమించడానికిలా ఆయన మసాలా వేసిన ఆహారం - ఎండు మాంసం, ఎండుచేపలు, చేప గుడ్లు, ఊరబెట్టిన కూరగాయలు - తినడం ద్వారా ప్రయత్నించేవాడు. ఆయన మెదడు చేసే అపారమైన పని వలన ఆయన కడుపు నష్టపడవలసి వచ్చింది.

తన మెదడుకు ఆయన తన శరీర సంతతినీ బలిచేసినాడు. ఆలోచన అన్నిటికంటె గొప్ప ఆనందం ఆయనకు. ఆయన చిన్నప్పటి తత్వశాస్త్ర గురువైన హెగెల్ మాటలను ఆయన చెప్పడం నేను చాలసార్లు విన్నాను. "మనుష్యుని దురాలోచనకు కూడా స్వర్గంలోని అద్భుతాలను మించిన ఔన్నత్యమూ, ఉదాత్తతా వుంది."

నిర్విరామమైన ఆయన కృషికి, అద్భుతమైన ఆయన జీవన చర్యకు అనుగుణంగా ఆయన శరీరస్థితి మంచిదై వుండాలి. అతని శరీరతత్వం ఆరోగ్యకరంగా నిరంతరం వుండేది. బాల్యంలో, ఆ తర్వాత వ్యాయామం చేసివుంటే, చాల బలిష్ఠమైన మనిషి అయ్యేవాడు.

నడక ఆయనకు వ్యాయామం. గంటల తరబడి షికారు పోయేవాడు. లేదా కొండలెక్కేవాడు. మాట్లాడుతూ, ధూమపానం చేస్తూ, అలసట ఎరుగకుండా వుండేవాడు. ఆయన తన గదిలో నడుస్తూ పనిచేసుకునే వాడని అనవచ్చు. నడుస్తూ ఆలోచించిన దాన్ని కాగితం మీద రాయడానికి మాత్రమే అప్పుడప్పుడు కాసేపు కూర్చునేవాడు. మాట్లాడేటప్పుడు అటూ-ఇటూ నడవడం ఆయనకు ఇష్టం. ఎప్పుడైనా ఒకసారి ఆవేశంగా వివరించేటప్పుడు, సంభాషణ గంభీరమైనప్పుడు ఆగేవాడు.

అనేక ఏళ్ళు నేను ఆయనతో కలిసి హాంప్‌స్టెడ్ హీత్‌లో సాయంత్రపు షికార్లు పోయినాను. ఆ గడ్డి మైదానాల్లో నడిచేటప్పుడే నేను అర్థశాస్త్రం నేర్చుకున్నాను. 'పెట్టుబడి' మొదటి భాగంలో ఆయన రాసిందంతా అది రాసేటప్పుడు నాకు వివరించినాడు, ఆ విషయం తాను గమనించకుండానే.

షికారునుండి ఇంటికి వస్తూనే, నేను విన్నదంతా సాధ్యమైన మేరకు ఎప్పుడూ రాసుకునేవాణ్ణి. గంభీరమైన, జటిలమైన ఆయన వాదాలను అర్థం చేసుకోవడం మొదట్లో నాకు కష్టంగా వుండేది. దురదృష్టవశాత్తు, ఆ అమూల్యమైన నోటుపుస్తకాలు నేను పోగొట్టుకున్నాను. కమ్యూన్ తర్వాత పారిస్‌లోను, బోర్డోలోనూ పోలీసులు నా కాగితాలు సోదించి తగలబెట్టినారు.

నాకు అన్నింటికంటె విచారం కలిగేది ఒక సాయంత్రం నేను రాసుకున్న నోట్సు పోయినందుకు ఆనాడు మార్క్స్ తనకు విలక్షణమైనట్టి పుష్కలమైన ఉపపత్తులతోనూ, వాదాలతోనూ, మానవ సమాజాభివృద్ధిని గురించిన తన ఉజ్వలమైన సిద్ధాంతాన్ని వివరించినాడు. నా కనులమీద పొరలు విడిపోయి

పట్టయింది. మొట్టమొదటిసారిగా ప్రపంచ చరిత్ర వెనకవున్న తర్కం నాకు స్పష్టంగా అర్థమైంది. పైకి చూడటానికి ఎంతో పరస్పర విరుద్ధంగా కనపడే ఘటనలను—సమాజాభివృద్ధినీ, భావాల అభివృద్ధిని—వాటి భౌతిక జన్మస్థానాలదాక అనుసరించ గలిగాను. నాకు కన్నులు మిరుమిట్లు గొలిపినాయి. నా మనస్సుపైన ఆ ముద్ర చాలఏండ్లు వుండింది.

మార్క్స్ సిద్ధాంతాల్లో అత్యంత గంభీర సుందరమైన ఆ సిద్ధాంతాన్ని నా దుర్బల శక్తి సామర్థ్యాలకు తగినట్లు నేను మాడ్రిడ్ సోషలిస్టులకు వివరించినపుడు వాళ్ళకు అలాంటి ముద్రే కలిగిందా. నిస్సందేహంగా, ఆ సిద్ధాంతం మానవ మేధ ఆవిష్కరించిన అత్యున్నత సిద్ధాంతాల్లో ఒకటి. (పారిస్ కమ్యూన్ ఓడిపోయిన తర్వాత లాఫార్గ్ స్పెయిన్‌కు పారిపోయినాడు. మార్క్స్ మొదట మొదట ఇంటర్నేషనల్ జనరల్ కౌన్సిల్ ఆయనకు అరాచకవాద బకూనినిస్టులతో పోరాడే పనిని అప్పగించినాడు.)

చరిత్ర, ప్రకృతిశాస్త్రం, తాత్విక సిద్ధాంతాలు తదితరమైన వాటిలో మార్క్స్‌కు అపారమైన పరిజ్ఞానం వుండేది.

ఏండ్లతరబడి సాగిన భౌతిక కృషిలో ఆయన సేకరించిన జ్ఞానాన్ని, గమనించిన విషయాలను ఉపయోగించుకోవడంలో ఆయనకు అసాధారణమైన ప్రజ్ఞ వుండింది. ఎప్పుడు ఏ విషయం పైన అడిగినా, చాలిసరమైన జవాబు లభించగలదు. దాని వెంట సార్వత్రికంగా వర్తించే తాత్విక అభిప్రాయాలు కూడ ఎప్పుడూ వుంటాయి. అనేక రంగాలలో ఆయనకు గొప్ప అవగాహన వుండేది.

ఆయన గొప్ప జ్ఞానము, ఆయన మేధాశక్తి "పెట్టుబడి"లో కనపడుతుందనడంలో సందేహం లేదు. నా దృష్టిలో ఆయన సన్నిహిత మిత్రుల దృష్టిలో, ఆయన జ్ఞాన విస్తృతి, మేధా పరిమాణం, "పెట్టుబడి", ఇంకా ఇతర రచనలలో పూర్తిగా కనపడదు. తన రచనల కంటె ఆయన ఎంతో ఉన్నతుడు.

నేను మార్క్స్‌తో కలిసి పనిచేసేనాను. ఆయన చెప్తావుంటే నేను రాసేవాణ్ణి అంతే. కాని, దాని ద్వారా నాకు ఆయన ఆలోచనా ప్రవృత్తిని, రచనా విధానాన్ని గమనించే అవకాశం లభించింది. పని చేయడం ఆయనకు సులభం. అదే సమయంలో కష్టం కూడా. సులభం ఎందుకంటే సంబంధం గల వాస్తవాలను, వాదాలను వాటి పూర్ణత్వంలో గ్రహించడం ఆయన మెదడుకు కష్టంకాదు. గాని, సరిగ్గా ఆ పూర్ణత్వమే ఆయన భావాల అభివ్యక్తిని దీర్ఘమైన, కష్టమైన పనిగా చేసేది.

మార్క్స్ వస్తువుల ఉపరితలమే కాక, దాని కింద వున్నది కూడ ఆయన చూసేవాడు వస్తువులోని అంగాలన్నిటిని వాటి పరస్పర చర్య ప్రతిచర్యలలో ఆయన పరిశీలించేవాడు.

ప్రతిఅంగాన్ని విడదీసి, దాని అభివృద్ధి చరిత్రను గమనించేవాడు. వస్తు

వుకు, పరిసరాలకు మధ్యవున్న పరస్పర చర్యా ప్రతిచర్యలను గమనించేవాడు.

వస్తువు పుట్టుక, దాని స్థితిగతులు, దాని మార్పులు మొదలైనవి గమనించి, అత్యంత నిశితంగా పరిశీలించి దాని వివరాలను గణనీయంగా ఆయన సాధించేవాడు. నిత్య చలనంలో వున్న వస్తువులను, మహా జటిల ప్రపంచాన్ని ఆయన చూసేవాడు.

ఆ ప్రపంచాన్ని విభిన్న కోణాలతో వివిధ పద్ధతులలో గమనించి, చర్యా ప్రతిచర్యలతో వివరించడం ఆయన ఉద్దేశం. చూసినది నికరంగా వ్యక్తం చేయడం ఎంతో కష్టమని ఫ్లాబెర్, గొన్‌కూర్‌లకు చెందిన సాహిత్యకారులు అంటారు. బాహ్య స్వరూపం మాత్రమే వారు వ్యక్తం చేయదలచుకుంటారు. మార్క్స్ కృషితో పోలిస్తే వాళ్ళ సాహిత్య కృషి పిల్లల ఆట. చూసింది ఇతరులకు వివరంగా చెప్పగలగటం, వాస్తవాన్ని గ్రహించడానికి అసాధారణమైన ఆలోచనాశక్తి అవసరం.

మార్క్స్ తన రచనతో ఎప్పుడూ తృప్తిపడలేదు. ఆయన ఎప్పుడూ ఏవో మెరుగులు దిద్దుతుండేవాడు. తాను చెప్పదలుచుకొన్న భావం కంటె, తాను చెప్పింది ఎప్పుడూ ఆయనకు తక్కువగానే వుండేది.

మార్క్స్‌కు మహామేధావి లక్షణాలు రెండు వుండినాయి. ఒక వస్తువును దాని పూరక భావాలుగా విభజించడంలో ఆయనకు గొప్ప ప్రజ్ఞ వుండింది. ఆ భాగాలను కలిపి ఆ వస్తువును దాని సకల భిన్న అభివృద్ధి రూపాంతరాలతోసహా, పునర్నిర్మించడంలోనూ, వాటి పరస్పర అంతరంగిక సంబంధాలను ఆవిష్కరించడంలోను ఆయనది అందెవేసిన చేయి. ఆయన నిరూపణలు ఊహాత్మక భావాలు కాదు. ఆలోచించడం చేతకాని అర్థశాస్త్రవేత్తలు ఆయన మీద వేసే నింద అది. రేఖాగణిత శాస్త్రజ్ఞుడు తన నిర్వచనాలు చుట్టూ వున్న ప్రపంచం నుండి తీసుకుంటాడు. కాని నిర్ణయాలు చేసేటప్పుడు వాస్తవాన్ని నిర్లక్ష్యం చేస్తాడు. మార్క్స్‌ది అలాంటి పద్ధతి కాదు. "పెట్టుబడి" ఏకాకులుగా వున్న నిర్వచనాలు గాని, సూత్రాలుగాని ఇవ్వదు. అత్యంత సులభంగా జారిపోయే అర్థచ్ఛాయలను, కను దప్పిపోయే స్థాయీ భేదాలను వెల్లడిచేసే అత్యంత తీక్షణ దృష్టిగల పరిశీలనా పరంపరను ఇస్తుంది అది.

పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం పెత్తనం చేసే సమాజం సంపద అపారమైన సరుకుల సముదాయంగా వుంటుంది అనే సాదా వాస్తవంతో మార్క్స్ ప్రారంభిస్తాడు. కనుక, గణిత భావంగా గాక, భౌతికమయిన వస్తువుగా వుండే సరుకు ఎ పెట్టుబడిదారీ సంపద మూలకం లేక కణం.

మార్క్స్ ఇప్పుడు సరుకును తీసుకుని దాన్ని ఇటు తిప్పి, అటు తిప్పి, లోపలిది పైకి, పైది లోపలికీ తిప్పి దాని రహస్యాలు ఒకొక్కటీ బయటకు లాగుతాడు— ఆ రహస్యాలు అధికారిక అర్థశాస్త్రవేత్తలకు బొత్తిగా తెలియనివి. కాథలిక్ మతంలోని మొత్తం రహస్యాలకంటే అధిక సంఖ్యాకంగా గంభీరంగాను వున్నప్పటికీ, ఆ సరుకు

సకల పార్శ్వాలను పరిశీలించిన తర్వాత మార్క్సు మారకంలో ఆ సరుకుకు తన తోటి సరుకుతో గల సంబంధాలను పరిశీలిస్తాడు, తరువాత ఆయన దాని ఉత్పత్తిని, దాని ఉత్పత్తికి కావలసిన చారిత్రక పూర్వాపరాలనూ పరిశీలించడానికి పోతాడు.

సరుకులు ధరించే రూపాలను ఆయన పరిశీలించి, అవి ఒక రూపం నుండి మరొక రూపానికి ఎలా మారేదీ, ఒక రూపంనుండి మరొక రూపం ఎలా విధిగా ఉత్పన్నమయ్యేది వెల్లడిస్తాడు.

ఘటనల అభివృద్ధిలోని తార్కికగతిని ఆయన ఎంత సర్వసమగ్రమైన నేర్పుతో వివరిస్తాడంటే, అదంతా ఆయన స్వకపోల కల్పన అని ఎవరైనా అనుకోవచ్చు! కాని అది వాస్తవం నుండి పుట్టింది. సరుకు వాస్తవమయిన పరస్పరాత్మకతకు ప్రతిబింబం.

మార్క్సు తన కర్తవ్యంవిషయంలో ఎంతో నిజాయితీ గలవాడు. ఒక వాస్తవంగాని, ఒక అంకెగాని, అత్యుత్తమ ప్రామాణికులు అంగీకరించింది తప్ప ఆయన ఎపుడూ ఇవ్వలేదు. ఆయన ఎపుడూ సెకండుహ్యాండు సమాచారంతో తృప్తిపడలేదు. ఎప్పుడూ దాని మూల స్థానానికి పోయేవాడు. పోవడం ఎంత కష్టమయినాసరే! ఒక చిన్న వాస్తవాన్ని ధృవపరచుకోడానికి ఆయన బ్రిటిష్ మ్యూజియంకి పోయి, అక్కడపుస్తకాలు చూచేవాడు. ఆయన నిర్లక్ష్యం కలవాడని గాని, కఠినమైన పరీక్షకు ఆగని వాస్తవాల మీద తన వాదాలను నిర్మించినాడని గాని ఆయన విమర్శకులు ఎప్పుడు రుజువు చేయలేక పోయినారు.

ఎప్పుడూ మూలస్థానం పోయే అలవాటు వుండటం వలన ఆయన అప్రసిద్ధులైన రచయితలను చదివేవాడు: వాళ్ళను ఆయన తప్ప ఎవరూ ఉటంకించే వాళ్ళు కాదు.

“పెట్టుబడి”లో అప్రసిద్ధ రచయితల ఉల్లేఖనలు ఎంతగా వున్నాయంటే, మార్క్సు తన పాండిత్యం ప్రదర్శించుకుంటున్నాడని ఎవరైనా అనుకోవచ్చు: ఆయనకి అలాంటి ఉద్దేశమేమి లేదు.

“నేను చారిత్రక న్యాయం చేకూరుస్తాను: ఎవరికి ఇవ్వవలసింది వారికి ఇస్తాను” అన్నాడు ఆయన.

ఒక భావాన్ని మొటమొదట వ్యక్తం చేసిన రచయితను లేక అత్యంత నిర్దుష్టంగా సూత్రీకరించినవాణ్ణి, అతను ఎంత అనామకుడైనా, ఎంత అప్రసిద్ధుడైనా, పేర్కొనటం తన ధర్మమని ఆయన భావించినాడు.

మార్క్సు శాస్త్రదృష్ట్యా ఎంత చిత్తశుద్ధి కలవాడో, సాహిత్య దృష్ట్యా కూడా అంతే చిత్తశుద్ధి కలవాడు. పరమ నిర్ధారణంగా తెలిసిన విషయం తప్ప ఆయన ఆధారపడక పోవడమే కాక, సమగ్రంగా అధ్యయనం చేసిందాకా ఆయన ఏ విషయం గురించి మాట్లాడే వాడు కాడు. అత్యంత ఉచితమైన రూపం లభించిందాక పదేపదే దిద్దిగాని ఆయన తన రచన ఒకటి కూడ ప్రచురించలేదు. సమగ్రమైన సన్నాహాలు లేకుండా పదిమంది ఎదుటపడటం ఆయన భరించలేని పని. చివరి మెరుగులు

పెట్టుకుంటా తన రాత ప్రతులు చూపించడం ఆయనకు మహా బాధ. ఇది ఆయనకు ఎంత తీవ్రమైన విషయమంటే, తన రాతప్రతులను కాల్చనైనా కాలుస్తాను కాని, అసంపూర్తిగా వదిలిపెట్టనని ఆయన నాతో ఒకనాడు అన్నాడు.

మార్క్సు పని పద్ధతి ద్వారా ఆయన మీద పడిన కర్తవ్యాల పరిమాణాన్ని పాఠకుడు ఊహించుకోవడం సాధ్యం కాదు. "పెట్టుబడి"లో ఫ్యాక్టరీ శాసనాల మీద ఏ ఇరవై పేజీలో రాయడానికి, ఇంగ్లండు, స్కాట్లండుల కమిషనులు, ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్‌లూ సమర్పించిన నివేదికలు గల 'నీలం పుస్తకాల' గ్రంథాలయమంతా ఆయన చదివినాడు. ఆ పుస్తకాలు ఈ అట్టనుండి ఆ అట్టదాకా చదివినాడనే విషయం వాటిలోని పెన్సిల్ గుర్తులను బట్టి తెలుసుకోవచ్చు. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానాన్ని అధ్యయనం చేయడానికి ఆ నివేదికలు అత్యంత ముఖ్యమైన, విలువైన పత్రాలని ఆయన భావించినాడు. వాటిని తయారుచేసిన వాళ్ళను గురించి ఆయనకు ఎంత గొప్ప సదభిప్రాయం వుండేదంటే, "ఇంగ్లీషు ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్ల లాగ సామర్థ్యం కలిగి, పక్షపాతం లేకుండా, వ్యక్తుల పట్ల గౌరవం లేకుండా వున్నవాళ్ళు "యూరపులో, మరేదేశంలోనైనా ఉండడం సాధ్యమని ఆయన నమ్మలేకపోయినాడు.

"పెట్టుబడి" ఉపోద్ఘాతంలో ఆయన వాళ్ళను అంత ఘనంగా ప్రస్తుతించాడు.

ఈ "నీలం పుస్తకాల" నుండి ఆయన ఎంతో వాస్తవ సమాచారం తీసుకున్నాడు. పార్లమెంటు సభ్యులకు ఆ పుస్తకాలు ఇస్తారు కాని, వాళ్ళలో చాల మంది వాటిని తుపాకి లక్ష్యాలుగా మాత్రమే ఉపయోగించుకుంటారు. ఎన్ని పేజీలలో గుండు దూరుతుందో చూసి, దాన్ని బట్టి తుపాకి శక్తిని నిర్ణయించుకోడానికి. తక్కినవాళ్ళు వాటిని తూకానికి అమ్ముతారు. అంతకంటె, సముచితమైన పని వాళ్ళు చేయలేరు. ఎందుకంటె, తద్వారా మార్క్సు లాంగ్ ఏకర్‌లోని పాత పుస్తకాల వర్తకుల నుండి వాటిని చౌకగా కొనగలిగేవాడు. పాత పుస్తకాల కొరకు, పత్రాల కొరకు ఆయన వాళ్ళ దగ్గరికి మామూలుగా పోయేవాడు.

ఇంగ్లీషు అధికారిక దస్తావేజులను అందరికంటె ఎక్కువగా ఉపయోగించుకొని, ప్రపంచ దృష్టికి తెచ్చినవాడు మార్క్సు అని ప్రొఫెసర్ బీస్లీ అన్నాడు. ఇంగ్లండులోని కార్మిక వర్గ స్థితి మీద పుస్తకం రాయడంలో ఏంగెల్సు, 1845 ముందు నీలం పుస్తకాల నుండి చాలా పత్రాలు తీసుకున్న విషయం బీస్లీకి తెలియదు.

(లాఫార్గ్, పాల్ (1842-1911) ఫ్రెంచి అంతర్జాతీయ కార్మిక వర్గ ఉద్యమంలో ప్రముఖ వ్యక్తి.
మార్క్సు, ఏంగెల్సులకు సన్నిహిత మిత్రుడు. సహయోధుడు. మార్క్సు కూతురు లారా భర్త. మార్క్సు గురించిన స్మృతులు 1890లో వెలువడినాయి.)

# కాపిటల్ చరిత్ర

లారిసా మిత్స్‌కెవిచ్
యం. ఎ. (అర్థశాస్త్రం)

మార్క్స్ గురించి మీకేమి తెలుసు అని అడిగితే, వివిధ దేశాలలో అనేక మంది ఆయన దాస్ క్యాపిటల్ రచించాడని మాత్రం చెబుతారు.

మార్క్స్ ప్రధాన గ్రంథం అయిన దీని రచనకు 49 ఏళ్ళు, అంటే పండితుడుగా, విప్లవకారుడుగా ఆయన జీవిత కాలమంతా పట్టింది. ఈ గ్రంథ రచనా కృషి ప్రత్యక్షంగా 20 సంవత్సరాలపాటు సాగింది. మార్క్స్ 1843 లో రాజకీయ అర్థశాస్త్ర అధ్యయనం ఆరంభించారు. 1883 లో ఆయన శాశ్వతంగా కన్ను మూసినప్పుడు మాత్రమే, ఈ రంగంలో ఆయన పరిశోధనాకృషి నిలిచిపోయింది.

1844 నాటి అర్థిక, తాత్విక రచనలు" అన్న తన తొలి రాజకీయ అర్థశాస్త్ర పత్రంలో మార్క్స్ బూర్జువా, కార్మిక వర్గ ప్రయోజనాలు, ఉత్తర దక్షిణ ధృవాల వంటివి అని నిరూపించారు. బ్రిటిష్, ఫ్రెంచి, జర్మన్ అర్థశాస్త్రవేత్తల, ఊహావాద సోషలిస్టుల, తత్వశాస్త్రజ్ఞుల గ్రంథాల నుంచి ఎత్తి రాసుకున్న భాగాలతో నిండిన మార్క్స్ నోటు పుస్తకాలు ఆయన సాగించిన బ్రహ్మాండమయిన సన్నాహక కృషిని తెలియజేస్తున్నాయి.

1848-49 లో నాటి యూరపు విప్లవం ఆయన పరిశోధనా కృషికి తాత్కాలిక అంతరాయం కల్గించింది. ఎంగెల్స్ తదితర సహచరులతో కలిసి ఆయన ఈ విప్లవ ఘటనల్లో అత్యంత క్రియాశీలంగా పాల్గొన్నారు. విప్లవం ఓటమితో ఆయన లండన్ వెళ్ళిపోయి మళ్ళీ అర్థశాస్త్ర అధ్యయనంలో నిమగ్నమయారు. ఆయన ద్రవ్యం, ద్రవ్య చెలామణీ, సంక్షోభాలు, భూ సంబంధాలు, పెట్టుబడిదారీ విధాన చరిత్ర—వీటికి సంబంధించిన సాహిత్యాన్ని అధ్యయనం చేశారు.

మార్క్స్ బ్రిటిష్ మ్యూజియం గ్రంథాలయంలో తమ పరిశోధన కృషిని కొనసాగించారు. ఆ రోజుల్లో ఈ గ్రంథాలయం దానికదే సాటి. దానిలో ప్రపంచ విజ్ఞానశాస్త్ర రంగానికి సంబంధించిన అద్భుతమయిన గ్రంథ పరిచయం వుండేది. ఆయన అంటి శ్రమశీలి అయిన పాఠకులు అరుదుగా వుంటారు. ఆయన ఉదయం 9 గంటలకు గ్రంథాలయం తెరిచేసరికి అక్కడ వుండేవారు; సాయంత్రం 7 గంటలకు గ్రంథాలయం మూతపడే వరకు ఆయన అక్కడేవుండేవారు. ఆయన అక్కడ లెక్కలేనన్ని పుస్తకాలు, వ్యాసాలు చదివారు. ఇంటి

వద్ద కూడా ఆయన తరచు తెల్లవార వచ్చే వరకు గ్రంథ పఠన, రచనా సాగిస్తూనే వుండేవారు. మార్క్స్, ఎంగెల్స్‌లు వారు రాసిన మూల భాషల్లో యిప్పుడు వెలువడుతున్న వారి గ్రంథాల్లో మార్క్స్ రాజకీయ అర్థశాస్త్రం విషయాలకు సంబంధించి రాసుకున్న నోట్సు అన్నీ వున్నవి. వీటి బాహుళ్యాన్నిబట్టి ఎంత విస్తారమైన సమాచారంపై ఆధారపడి ఆయన తన ఆర్థిక సిద్ధాంతాన్ని రూపొందించారో విదితమవుతుంది.

మార్క్స్ తన అర్థశాస్త్ర సిద్ధాంతాన్ని అభివృద్ధిపరచటం కమ్యూనిస్టు పార్టీ సభ్యుడుగా తన విధి అని భావించారు. భవిష్యత్ సోషలిస్టు విప్లవాలను నిర్వహించేందుకు కార్మికవర్గానికి ఈ సిద్ధాంత ఆయుధం అవసరమని ఆయన అభిప్రాయం. కార్మికవర్గం తన విప్లవ కర్తవ్యాలను గ్రహించేందుకు ఈ సిద్ధాంతం తోడ్పడుతుందనీ, వారి వర్గ చైతన్యాన్ని పెంచుతుందనీ ఆయన విశ్వాసం.

మార్క్స్ అద్భుతమనిపించేటంత స్వల్ప వ్యవధిలోనే, విజయపరంపరను సాధించారు. 1851 లో ఆయన ద్రవ్యం గురించీ, భూమి బాడుగ గురించీ ముఖ్యమైన కొన్ని సైద్ధాంతిక భావాలను ముందుకు తెచ్చారు; బూర్జువా రాజకీయ అర్థశాస్త్రాన్ని లోతుగా అధ్యయనం చేశారు. కాని, ఆరోజుల్లో ఈ విషయంపై ఒక పుస్తకాన్ని ప్రచురించేందుకు ఆయన చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. ఒక ప్రగతిశీల అమెరికన్ పత్రికకు విలేఖరిగా పనిచేస్తూ రాసిన వ్యాసాల్లో ఆయన, సంక్షోభాలు, పెట్టుబడిదారీ వ్యవస్థకు స్వతస్సిద్ధమయినవని నిరూపించారు. పెట్టుబడిదారీ విధానాన్ని ఖచ్చితంగా, శాస్త్రీయంగా వివేచనచేసి ఆయన మితిమీరిన ఉత్పత్తి ఫలితమయిన ఒక కొత్త సంక్షోభం ఆసన్నమయిందని నిర్ధారణ చేశారు.

సంక్షోభం వల్ల పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ పొందిన కుదుపు ఒక కొత్త విప్లవానికి తోవతీయవచ్చని మార్క్స్, ఎంగెల్స్‌లు ఆ రోజుల్లో భావించారు. అందుచేతనే 1857-1858 సంక్షోభం చారస్థాయిలో వుండగా మార్క్స్ రాజకీయ అర్థశాస్త్ర విమర్శ అనే పుస్తకం రచనను హుటాహుటిన పూర్తి చేశారు. అచ్చులో రమారమి 50 పేజీల ఈ పుస్తకం, నిజానికి దాస్ క్యాపిటల్‌కు తొలిపాఠం. 1859 *రాజకీయ అర్థశాస్త్ర విమర్శకు ఒక దోహదం, తొలివిడత* అనే శీర్షికతో వెలువడిన ఈ పుస్తకంలో మార్క్స్ ప్రపంచ చరిత్రలో మొట్ట మొదటిసారి అదనపు విలువ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు; భవిష్యత్ కమ్యూనిస్టు సమాజం గురించి అనేక భావాలను ముందుకు తెచ్చారు.

అమ్మకం సరకు గురించీ, ద్రవ్యం గురించీ, మార్క్స్ రాయ నిర్ణయించుకున్న ఒక బృహత్ గ్రంథం తాలూకు రెండు అధ్యాయాలు ఈరచనలో ఉన్నవి. ఈ పుస్తకానికి రాసిన ముందు మాటలో మార్క్స్ తన ప్రముఖమైన తొట్ట తొలి శాస్త్రీయ ఆవిష్కరణకు స్పష్టమయిన రూపమిచ్చారు. ఒక సామాజిక, ఆర్థిక వ్యవస్థను తొలగించి మరో సామాజిక,

ఆర్థిక వ్యవస్థ దాని స్థానాన్ని తీసుకోవటం అనివార్యం. సోషలిజం, పెట్టుబడిదారీ వ్యవస్థ స్థానాన్ని ఆక్రమిస్తుంది అని నిరూపించే చారిత్రక భౌతికవాదం గురించిన మౌలిక భావాలే ఈ ఆవిష్కరణ.

తొలి విడత అచ్చయిన తరువాత మార్క్స్ రెండవ విడత రచనకు ఉపక్రమించారు. దీనిలో పెట్టుబడి గురించిన ఒక అధ్యాయాన్ని చేర్చాలని ఆయన తలపెట్టారు. ఈ అధ్యాయంతోనే, "అసలయిన పోరాటం ఆరంభమౌతుంది" అని ఆయన అన్నారు. (మార్క్స్, ఏంగెల్స్ రచనలు సం. 30, పుట 465, రష్యన్ ముద్రణ). కాని, ప్రచురణకర్తతో కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం 6-12 అచ్చు పేజీలను మించకుండా వుండవలసిన ఈ రెండో విడత దాదాపు 200 పుటల పెద్ద గ్రంథం అయి కూర్చుంది. 1861-1863 లో తయారయిన ఈ రాత ప్రతి అసలు దాస్ క్యాపిటల్ గ్రంథం వెలువడక ముందుకు సిద్ధమయిన ద్వితీయ పాఠం. దీని తయారీ ఆరంభించిన తరువాత మార్క్స్, తాను ఈ పుస్తకంలో చర్చించ తలపెట్టిన ప్రధాన సమస్యల గురించి తనకింకా పూర్తి స్పష్టత లేదని గ్రహించారు. ఆయన మళ్ళీ బ్రిటిష్ మ్యూజియం గ్రంథాలయానికి వెళ్ళి రాజకీయ అర్థశాస్త్రానికి సంబంధించిన సరికొత్త సమాచారాన్ని అధ్యయనం చేయ నారంభించారు.

మార్క్స్ దాస్ క్యాపిటల్ రాస్తున్న రోజుల్లో ఆయన కుటుంబం కటిక దారిద్ర్యం అనుభవించింది. ఆయన చివరి జత కట్టుగుడ్డలు సైతం తాకట్టు పడిపోయాయి. ఆ సంవత్సరాల్లో ఆయన తన ముద్దులపట్టి చిన్నారి జీన్‌తో సహా పలువురు బిడ్డలను కోల్పోయారు. ఆ కష్టకాలంలో ఎంగెల్స్ ఆయన్ను భౌతికంగానూ, ఆత్మికంగానూ ఆదుకొన్నారు.

1863-1865 లో మార్క్స్ దాస్ క్యాపిటల్ కొత్త ప్రతిని సిద్ధం చేశారు. ఇది మూడు సంపుటాలయింది. ఎంగెల్స్ సలహాపై ఆయన దీని రాతప్రతిని, పెట్టుబడియొక్క ఉత్పత్తి పరిశోధనకు అంకితమైన మొదటి సంపుటం రచనకు వుపయోగించ నిర్ణయించారు. టైప్ రైటర్లు యింకా రాని ఆ రోజుల్లో మార్క్స్ అమిత ఆనందోత్సాహాలతో, స్వహస్తంతో దాని రాతప్రతిని సిద్ధం చేశారు. "సుదీర్ఘ ప్రసవవేదన అనుభవించి జన్మనిచ్చిన తల్లి తన బిడ్డను తడివి చూచుకొన్నట్లు నేనూ నా బిడ్డను ఆనందంతో తడివిచూచుకున్నాను" అని మార్క్స్ రాశారు. (మార్క్స్, ఎంగెల్స్, రచనలు, సంపుటి 31, పుట 150 రష్యన్ ముద్రణ) ఇది కేవలం యాంత్రికంగా తిరిగి రాసింది కాదు. శుద్ధ ప్రతిని రాసేటప్పుడు ఆయన తొలి పాఠంలో సవరణలు చేశారు; కొన్ని అంశాలను విశదీకరించారు. 1867, ఆగస్టు 16 న హాంబర్గ్‌లోని ప్రచురణకర్తకు చివరి ప్రూఫులు పంపిన తరువాత ఆయన ఎంగెల్స్‌కు యిలా రాశారు. "ఈ గ్రంథం చివరకు తయారయింది. ఇందుకు నేను మీకు పూర్తిగా ఋణపడివున్నాను.

మీరు నా కోసం అనేక త్యాగాలు చేయ దానికి సిద్ధపడి వుండకపోతే, నేను ఈ మూడు సంపుటాల తయారీకి సంబం ధించిన బృహత్కార్యాన్ని ఎన్నటికీ నెరవేర్చ గలిగేవాణ్ణికాను. నిండయిన కృతజ్ఞతా భావంతో మిమ్మల్ని ఆలిం గనం చేసుకొంటున్నాను" (రచనలు, సంపుటి 31, పుట 275, రష్యన్ ముద్రణ).

పెట్టుబడి అన్నది పెట్టుబడిదారుల "పొదుపరితనం", మితానుభోగం ఫలిత మని చెప్పే, బూర్జువా పండితుల వాదన లను మార్క్స్ తమ రచనలో పూర్వ పక్షం చేశారు; పెట్టుబడిదారులు యిత రుల శ్రమ ఫలితాన్ని దోచుకొని తాము సంపన్ను లవుతారని నిరూపించారు. అదనపు విలువ గురించిన మార్క్స్ బోధను—ఇది ఆయన గావించిన ప్రముఖమైన రెండవ ఆవిష్కరణ— లెనిన్ మార్క్సిస్టు ఆర్థిక సిద్ధాంతానికి మూల స్తంభమని వర్ణించారు.

మార్క్స్ స్వయంగా ఈ క్యాపి టల్‌ను బూర్జువా వర్గం తలపైకి గురి చూచి విసరబడిన అత్యంత భయానక మయిన ఆయుధమని వర్ణించారు. దీని మొదటి సంపుటం ఒక వేయి ప్రతుల్లో వెలువడింది. ఇప్పటికి అది డజన్ల కొలది ప్రపంచ భాషల్లో లక్షలాది ప్రతుల్లో వెలువడింది. కార్మిక వర్గం నుంచి ఈ గ్రంథానికి లభించిన గుర్తింపే, తన బ్రహ్మాండమయిన కృషికి మార్క్స్ పొందిన ప్రతిఫలం. 1868 లో బ్రసెల్సులో జరిగిన మొదటి ఇంట ర్నేషనల్ మహాసభ, దాస్ క్యాపి టల్‌ను అన్ని దేశాల కార్మికులు అధ్యయనం చేయాలనీ, అది యితర భాషల్లోకి అనువదించబడేలా కృషి చేయాలనీ సిఫారసుచేస్తూ ఒక తీర్మానం ఆమోదించింది. కార్మికవర్గ పత్రికలు ఈ పుస్తకాన్ని వేనోళ్ళ కొనియాడాయి.

మార్క్స్, ఎంగెల్సులు జీవించి వుండగా దాస్ క్యాపిటల్ 9 భాషల్లోకి అనువాదం పొందింది. 1872 లో వెలు వడిన రష్యన్ ముద్రణ దాని తొలి విదేశీ భాషానువాదం. దీని రష్యన్ అను వాదకుల్లో ఒకరయిన లొపాతిన్, ఈ అనువాదం తయారీకి సంబంధించిన శాస్త్రీయ సమస్యలను లండన్‌కు వెళ్ళి మార్క్స్‌తో చర్చించారు.

దాస్ క్యాపిటల్ మొదటి సంపుటి వెలువడిన తరువాత ఎంగెల్స్, సోష లిజంతో తలపడాలని కోరుకొనేవా రెవరయినా యింకా వుంటే, వారు యిక మీదట మార్క్స్‌తో కూడా తలపడాల్సి వుంటుంది అని రాశారు. ఈ గ్రంథం వెలువడిన తరువాత గడచిన 115 సంవ త్సరాల కాలం, మార్క్స్‌ను పూర్వ పక్షం చేయటం అసాధ్యమని నిరూ పించింది. ఆయన కనుగొన్న మానవ జాతి పరిణామ నియమాలు నేటికీ పూర్తిగా చెల్లుబాటయేవే.

మార్క్స్ తుది శ్వాస విడిచేవరకూ, దాస్ క్యాపిటల్ తదుపరి సంపుటాలను సిద్ధం చేస్తూనే గడిపారు. కాని, ఈ పని ఆయన జీవితకాలంలో పూర్తికాలేదు. దాని రెండవ, మూడవ సంపుటాలు ఎంగెల్స్ సంపాదకత్వాన వరుసగా

(మిగతాది 53వ పేజీలో)

# స్త్రీ - దోపిడి

మార్క్స్

## 1. మితిమీరిన శ్రమవల్ల మృతి

1863 జూన్ ఆఖరు వారం, లండన్ లోని అన్ని దినపత్రికలు "ఆకట్టుకోగల" శీర్షికతో ఒక పేరా ప్రచురించాయి: "స్వల్పమైన అధికశ్రమలో మృతి" ఆ వార్త ఇరవై సంవత్సరాల వయసు గల, దుస్తులు తయారుచేసే మేరీ అన్నేవాక్లీ గురించి. ఎలైస్ అనే చక్కని పేరు గల మహిళ దోపిడీ సాగిస్తున్న, పేరొందిన దుసుల తయారీ సంస్థలో ఆమె పనిచేస్తోంది.

ఎప్పుడూ చెప్పే పాతకథే మరోసారి పునరావృతమైంది. మేరీ సగటున రోజుకు పదహారున్నర గంటలు పనిచేసేది. సీజన్‌లో తరచుగా ఆగకుండా ముప్పై గంటలు పనిచేసేది; పడిపోతున్న ఆమె శ్రమశక్తి పుంజుకునేందుకు ఎప్పుడైనా కొద్దిపాటి మద్యమో, కాఫీయో లభించేది. ఇది సీజన్‌లో చాలాయుమ్మరమైన కాలం. కొత్తగా దిగిన వేల్స్ రాకుమారుని గౌరవార్థం జరిగే నృత్యానికి ఆహ్వానితులైన కులీన కుటుంబ స్త్రీలకు కళ్ళు మిరుమిట్లు గొలిపే ఖరీదైన వస్త్రాలనుతయారు చేయడం అవసరం.

మేరీ అన్నేవాక్లీ రనతోటి అరవై మంది అమ్మాయిలతో పాటు ఎలాంటి విశ్రాంతి లేకుండా ఇరవై ఆరున్నర గంటలు పనిచేసింది. ఒక్క గదిలో ముప్పైమంది. ఒక ఘనపుటడుగు గాలిలో మూడవవంతు మాత్రమే వారు పీల్చుకోగలరు. రాత్రి అయ్యాక అట్టలతో విభజించబడిన పడకగదు లనబడే గాలి దూరని కంతల్లో జతలు జతలుగా నిద్రపోయారు. లండన్‌లోని ఉత్తమమైన దుస్తులతయారీ సంస్థల్లో ఒకటి అది. మేరీ అన్నేవాక్లీ శుక్రవారం నాడు జబ్బుపడింది. ఆదివారంనాడు మేడమ్ ఎలైస్‌కు ఆశ్చర్యం కలిగించే విధంగా గతంలో ఇచ్చిన పని పూర్తిచేయకుండానే చనిపోయింది.

మరణశయ్య దగ్గరకు డాక్టర్ కీస్‌ను చాలా ఆలస్యంగా పిలవడం జరిగింది. మరణ విచారణాధికారి బృందం ముందు సాక్ష్యం చెపుతూ ఆయన ఇలా అన్నాడు: "క్రిక్కిరిసిన పని గదిలో గంటల తరబడి పనిచేసినందువల్ల, గాలి చొరలేని చాలా చిన్నదైన పడకగదివల్ల మేరీ అన్నేవాక్లీ చనిపోయింది." డాక్టరుకి మంచి అలవాట్ల విషయంలో పాఠం చెప్పడానికి మరణ విచారణాధికారి

బృందం తన న్యాయ నిర్ణయంలో ఇలా చెప్పింది: "రోగి శారీరక దుర్బలతవల్ల చచ్చిపోయింది. మితిమీరిన శ్రమవల్లనో, క్రిక్కిరిసిన గదిలో పనిచేయడం వల్లనో, ఆమె చావు త్వరితమైందని భయపడటానికి కారణాలు లేవు."

"మన శ్వేత బానిసలు" అంటూ కాబ్డెన్, బ్రైట్‌లు నడిపే స్వేచ్ఛా వ్యాపారుల పత్రిక "మార్నింగ్ స్టార్" ఆక్రోశించింది. "సమాధుల పర్యంతం శ్రమించే మన తెల్లబానిసలు, అత్యధిక భాగం నిశ్శబ్దంగా దుఃఖాన్ని అనుభవిస్తారు, చనిపోతారు."

---

(51వ పేజీ తరువాయి)

1885, 1894 సంవత్సరాల్లో వెలువడ్డాయి.

యునెస్కో సంస్థ 1967 లో దాస్ క్యాపిటల్ శత జయంతిని పాటించింది. మానవాళి ఆత్మిక ప్రగతిపై బ్రహ్మాండమయిన ప్రభావం కల్గించిన గొప్ప ప్రతిభావంతుడని మార్క్సుకు జేజే లర్పించింది. దాస్ క్యాపిటల్ కాల దోషం ఎరుగని గ్రంథంగా మానవజాతి సంస్కృతీ భాండాగారంలో శాశ్వతంగా నిలిచివుంటుంది.



(మార్క్స్. పెట్టుబడి, 1వ సంపుటి)

# చౌకబారు శ్రమం బాలల శ్రమం

## మార్క్స్

స్త్రీల శ్రమనీ, పదేళ్ళ లోపు బాలల శ్రమనీ గనులలో వినియోగించడం నిషేధించడానికి పూర్వం, పెట్టుబడిదారులు తరచుగా కంపెనీలలో పురుషులతోపాటు ఆచ్ఛాదనలేని స్త్రీలను, బాలలను నియమించడానికి పూనుకునేవారు. పెట్టుబడిదారుల, ప్రత్యేకించి వారి ఖాతాదారుల నైతిక నియమావళి దీనికి ఎప్పుడో అనుమతించింది. ఈ చట్టం ఆమోదించబడిన తర్వాత మాత్రమే వారు యంత్రాల వినియోగానికి సిద్ధపడ్డారు. యాంకీలు (అమెరికాలోని ఉత్తరాది రాష్ట్రాలవారు) రాళ్లు పగలకొట్టే యంత్రాన్ని కనిపెట్టారు. కానీ ఇంగ్లీషువాళ్ళు దాన్ని ఉపయోగించరు. ఎందువల్లనంటే "వార్భాగ్యుడు" (ఇంగ్లీషు వాళ్ళ రాజకీయ అర్థశాస్త్రంలో వ్యవసాయ రంగ శ్రామికునికి వాడేందుకు గుర్తింపు పొందినపదం) ఈ పని చేసి, తన శ్రమలో కొద్దిభాగానికి మాత్రమే చెల్లింపు పొందుతాడు. యంత్రం పెట్టుబడిదారునికి ఉత్పత్తి ఖర్చుని పెంచుతుంది. ఇంగ్లండులో ఇప్పటికీ కొన్ని సందర్భాలలో కాలువలలో పడవలను లాగేందుకు గుర్రాలకు బదులు స్త్రీలు ఉపయోగించబడుతున్నారు. ఎందువల్లనంటే, ఖచ్చితంగా తెలిసిన పరిమాణంలో గుర్రాలను, యంత్రాలను ఏర్పరచడానికి కావలసిన శ్రమకంటే, అదే సమయంలో అదనపు జనాభా స్త్రీలను నిర్వహించడానికి కావలసింది మొత్తం అంచనాకంటే తక్కువే.

(మార్క్స్ పెట్టుబడి 1వ సంపుటం)

యంత్రాలు, కండరశక్తితో విడివడినమేరకు, అది కండరశక్తి తక్కువగా వున్న కార్మికుల్ని, శారీరక పెరుగుదల అసంపూర్తిగా వున్నా సామర్థ్యం గల చేతులున్నవారిని ఉద్యోగులుగా చేసే సాధనంగా వినియోగపడతాయి. కాబట్టే యంత్రాల్ని వినియోగించే పెట్టుబడిదారులు స్త్రీ, బాల కార్మికులకోసం అన్వేషిస్తారు. శ్రమకీ, శ్రామికులకీ బలీయమైన ప్రత్యామ్నాయమైన ఇవి, ఒక్కసారిగా స్త్రీ, పురుష భేదం లేకుండా కార్మికుని కుటుంబంలోని ప్రతి సభ్యుడు, పెట్టుబడి ప్రత్యక్ష ఆధిపత్యం కింద వేతన కార్మికులుగా నమోదయ్యేసంఖ్యను పెంపొందించే సాధనాలయ్యాయి. పెట్టుబడిదారునికోసం చేయవలసిన నిర్బంధ శ్రమ, పిల్లల క్రీడాప్రదేశాల్ని మాత్రమే

కాక, ఎంత స్వల్ప పరిమితిలోనైనా కుటుంబానికి ఆసరాగా వుండేందుకు ఇంటి వద్ద చేసే స్వేచ్ఛాశ్రమని కూడా దురాక్రమించింది.

శ్రమశక్తి విలువని ఒక వయోజన కార్మికుని వ్యక్తిగత నిర్వహణకు అవసరమైన శ్రమకాలంమాత్రమే కాక, అతని కుటుంబ నిర్వహణ ఆవశ్యకత కూడా నిర్ణయిస్తుంది. యంత్రాలు, కుటుంబంలోని ప్రతి ఒక్కరినీ, శ్రమ మార్కెటులోకి త్రోసివేయడమే కాక, మానవుని శ్రమశక్తి విలువని అతని మొత్తం కుటుంబం మీదకి విస్తరింప చేశాయి. అది, ఆ విధంగా అతని శ్రమ శక్తిని చౌకచేస్తాయి. నలుగురు కార్మికులున్న కుటుంబ శ్రమ శక్తిని కొనుగోలుచేయడం, ఇంతకుముందు కుటుంబ పెద్ద శ్రమశక్తిని కొనుగోలు చేసినదానికన్నా ఎక్కువ ఖరీదే కావచ్చు; కానీ, దానికి బదులుగా, నాలుగు రోజుల శ్రమ ఒక వ్యక్తి స్థానాన్ని స్వీకరిస్తుంది. ఒక కార్మికుని అదనపు శ్రమమీద, నలుగురు కార్మికుల అదనపు శ్రమ పెరిగిన నిష్పత్తిలో, వారి విలువ కూడా పడిపోతుంది. కుటుంబ జీవనానికి, నలుగురు కార్మికులు శ్రమ చేయడమేకాక, ఇప్పుడు పెట్టుబడిదారుని కోసం కూడా అదనపు శ్రమను చేస్తారు. ఈ విధంగా చూస్తే, యంత్రాలు మానవ వినియోగాన్ని పెంచుతూనే, పెట్టుబడిదారుని దోపిడీ శక్తి యొక్క ప్రధాన ప్రయోజనాన్ని రూపొందిస్తున్నాయి; కొన్ని సమయాల్లో దోపిడీ తీవ్రతను పెంచేస్తున్నాయి.

(మార్క్స్ - పెట్టుబడి, సంపుటి - 1)



# ఒక ప్రముఖ ఆంధ్రునిపై రష్యన్ విప్లవ ప్రభావం

## వల్లూరి సూర్య నారాయణరావు బి.ఎ;బి.ఎల్.బిటి
## (ఆత్మ కథనుండి — 1936)

(కొంతకాలం క్రితం, కంభంపాటి (సీనియర్)గారు రాసిన వ్యాసాలు సంకలనం "అర్ధ శతాబ్ద కాలంలో ఆంధ్రుల పైని అక్టోబరు విప్లవ ప్రభావం" పేరుతో ఒక పుస్తకం వెలువడింది. అందులో భోగరాజు పట్టాభిసీతారామయ్యా జి. వి. కృష్ణారావు, నార్ల వెంకటేశ్వరరావు,దిగవల్లి శివరావుగారి రచనలనుండి, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రికల నుంచి ఉల్లేఖనలు విస్తారంగా యిచ్చారు. అది 'విశాలాంధ్ర' పాఠకులకు పరిచితాలే.

1930-35 సంవత్సరాల కాలంలో మరొక ప్రముఖ ఆంధ్రునిపై రష్యన్ విప్లవం కల్గించిన ప్రభావం, అటువంటి సాంఘిక విప్లవం ప్రపంచమంతటా రావాలన్న ఆయనఆకాంక్ష ఎట్టిదో పాఠకుల దృష్టికి తీసుకొచ్చేందుకు ఆయన ఆత్మకథ నుండి ఆ భాగాన్ని దిగువ యిస్తున్నాం. కంభంపాటిగారి గ్రంథంలో యిదిలేదు.

రచయిత వల్లూరి సూర్యనారాయణరావు. వీరి పూర్వీకులది (తాతముత్తాతలు) కృష్ణాజిల్లా పెదమద్దాలి. తల్లిదండ్రులు జీవించింది తూర్పు గోదావరి జిల్లా మండపేట. పందుకూరి వీరేశలింగం పంతులు గారివద్ద విద్యాభ్యాసం చేసారు. 1911లో నెల్లూరులో జరిగిన రాష్ట్ర కాన్ఫరెన్సులో ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకతపై ఆయన ఒక తీర్మానాన్ని ప్రతిపాదించగా, దానిని బులుసు సాంబమూర్తి, ముట్నూరి కృష్ణారావు గార్లు బలపరచినటు ఆత్మకథలోవుంది. సూరత్ కాంగ్రెసు, కాశీ కాంగ్రెసులకు హాజరయ్యారు.

సం. కమ్యూనిజం)

---

నాకిపుడు రషియాదేశములోని సమిష్టివాదులమీద యెక్కువ మక్కువ కలుగుచున్నది.అమెరికాలోని ధనవంతులగొప్ప పెట్టుబడి వ్యాపార మునను, రషియాలోని సమిష్టివాద పరిపాలనను జాయింటు వ్యాపారమునను గొప్ప సంఘటనము బయలుదేరినది. రషియాలో ప్రభుత్వము వారే వ్యవసాయము, వాణిజ్యము, వస్తు నిర్మాణస్థానములన్నిటినీ తమ చేతులలో నుంచుకుని, ప్రతివస్తువును, లాభమువేసి

కొనకుండకనే, అతి చౌకధరలతో ప్రపంచము నంతయు అయిదు సంవత్సరములలో ముంచదలచిరి. వారి రాజకీయ విధానమును, అక్కడి ప్రజలు మిక్కిలి స్వార్థత్యాగముతో నవలంబించుటకు వారి పరిపాలకులకు తోడ్పడుచున్నారు. ప్రభువులు తమ బలము నుపయోగించికూడ మూర్ఖులను తమ దారికి తీసుకొనివచ్చుచున్నారు. స్వంత ఆస్తి యనునది లేకుండ చేయుచు, అందరును కష్టించి పనిచేసినందుకు వారికి తగిన భోజన వసతులను కల్పించుచున్నారు. 18 సంవత్సరముల లోపు బాలురను, 60 సంవత్సరములు దాటిన వృద్ధులను పనిచేయ కూడదు, మొదటి వారికి ఉచితముగ అన్నవస్త్రములిచ్చి విద్య చెప్పించుటయును రెండవవారికి పెన్షనుల నిచ్చుటయునుకావలసిన యేర్పాట్లు చేయబడుచున్నవి. ప్రతివాడును, తనకేపూట కాపూటకు కావలనది సోవియట్లు సప్లయి చేయుచున్నప్పుడు, స్వార్థము, అసూయ, ఆగ్రహములు యెక్కడనుండును? నేరముల కవకాశమేది? ప్రతివాడును సతృప్తితో సౌఖ్యము ననుభవించును. ఈ స్థితికి దేశమంతయు వచ్చుటకు, నిరంకుశత్వము, దౌర్జన్యము అక్కడి పరిపాలకులుపయోగించక తప్పినది కాదు. ఇపుడు రష్యాలోని సమిష్టి రాజ్యాంగ తంత్రమునకు, వ్యతిరేక విప్లవము రాకుండ, తాత్కాలికముగ వ్యక్తి జీవనాభివృద్ధికి అనుకూలమగు పరిస్థితులు కల్పించబడినది. పదునైదు సంవత్సరములనుండి, బాలురకు ఉగ్గుపాలతో యీ సమిష్టివాదము ఒక మతముగా నేర్పుచుండుటవలన, యిప్పటినుండి రాబోవు తరగతుల వారు దీనిని వదలుట సంభవించదు.. ఇది యేమి నుమ్మందు పన సాంఘిక రాజకీయ మోక్షమునకు సాధనమగును. అమెరికా వారును, రష్యావారును, యంత్ర సామాగ్రితోనే పోటీ చేయుచున్నారు. ఈ యుభయుల విధానము భౌతికశాస్త్ర పరిశోధనల మీదనే యాధారపడిఉన్నది. ఈ రెంటికిని వ్యతిరేకముగమన మహాత్మాగాంధిగారి ఆధ్యాత్మిక విధానము బయలు దేరినది. నిరాడంబర జీవనము ఉత్కృష్టా దర్శములు కలిగి, అహింసా సత్యముల మీదనే సమస్త ఉద్యమాలను ఆధారపరచుకొని, మానవ కళ్యాణమునకు తోడ్పడవలసినదని మనలను మహాత్ముల వారు హెచ్చరించు చున్నారు. మొత్తము మీద ఈయన రష్యా దేశస్థులగు టాల్స్టాయి, లెనిన్ గార్ల యాదర్శముల నొప్పు కొందురుగాని, వారి రాజకీయ విధానమును ఖండించును. నవనాగరికతకు మహాత్ముడు విరోధియని యెన్నటికిని నమ్మరాదు. సమస్త యంత్ర సామగ్రియు, భౌతిక జ్ఞానమును మానవ కళ్యాణమునకే ఉపయోగింప చేయటమే యీయన సంకల్పము. వానికి మాత్రం మనము దాసులము కాకూడదు. ఈయన సత్యాగ్రహ విధానములో గొప్ప సాధకుడు, అనుభవజ్ఞుడు, స్థితప్రజ్ఞుడు సంకల్పసిద్ధుడు. ఈ యంత్ర సామగ్రిని దాని యజమానులకును, పనివాండ్రకును సమాన హక్కులతో నడపవలెనుగాని, వానివలన కలుగు లాభమంతయు పెట్టుబడిదార్లకును, కూలి మాత్రము కష్టించి పనిచేయు వాండ్రకును, పంచియిచ్చుట దేశమునకు అనర్థదాయకమని యీయన తలంపు. అనేక సాంఘిక విప్లవములు బయలుదేరినగాని, యీ స్థితి ప్రపంచమంతటిలో పొడకొనదు"

("సూర్యనారాయణీయము" అనే గ్రంథంనుండి)

# భారతదేశంపై మార్క్స్

డాక్టరు జి. అధికారి

(1968 జూన్ 22-24 తేదీలలో కీ.శే డాక్టరు అధికారి చేసిన ప్రసంగం నుండి)

భారత ప్రాచీన చరిత్రకు సంబంధించిన సమస్యను మార్క్స్ ఎంతో ప్రతిభావంతంగా దర్శించాడు. చారిత్రక భౌతికవాద దృష్టితో ఆ సమస్యను పరిష్కరించడానికి యత్నించాడు. సమకాలీన భారత సమస్యలనూ మార్క్స్ పరిశీలించాడు. శాస్త్రీయమయిన రాజకీయ అర్థశాస్త్ర దృష్ట్యా ఈ సమస్యలను పరిశీలించి భారత సామాజిక విప్లవ భవిష్యత్తును గురించి ఆయన చేసిన ఊహలను ఈనాడు దాదాపు నూరు సంవత్సరాల తర్వాత మదింపు వేస్తే, శాస్త్రీయ విప్లవ సిద్ధాంతాల పటుత్వం, నిజాయితీ, నైపుణ్యం బోధపడతాయి

సమకాలీన భారత పరిణామాలను మార్క్స్ ఎలా పరిశీలించాడో ప్రాచీన మధ్యయుగాల భారత చరిత్రను ఎలా వ్యాఖ్యానించాడో, తెలుసుకోవటం ఈ సందర్భంలో ఉచితంగా ఉంటుంది.

ఉత్పత్తి విధానాలపై ఆధారపడిసామాజిక నిర్మాణాలను వ్యాఖ్యానించటం, చారిత్రక భౌతికవాద ప్రత్యేకత.ఉత్పత్తి విధానంలో. ఉత్పత్తి శక్తులు వాటిని ఉపయోగించే మానవుల మధ్య ఏర్పడే ఉత్పత్తి సంబంధాలు, రెండూ అంతర్గ్రథితంగా ఉంటాయి. ఈ చారిత్రక భౌతిక వాదాన్ని మార్క్స్ మాటలతోనే తెలుసుకుందాము.

"చారిత్రక పోరాటాలన్నీ- మత తాత్విక, సైద్ధాంతిక రంగాలలో వేటిల్లో జరిగినా— నిజానికి సామాజిక వర్గాల ఉనికి, వారి మధ్య పోరాటాల ప్రతిబింబాలే తప్ప వేరుకాదు. అంతేకాదు ఈ వర్గాల మధ్య ఘర్షణ స్వభావం, వారి ఆర్థిక పరిస్థితి ఉత్పత్తి, మారకాలకు సంబంధించిన లోపము, పద్ధతి, వీటిపై ఆధారపడి ఉంటుంది."

ప్రతిభావంతమయిన ఈ సూత్రీకరణ. డార్విన్ పరిణామ సిద్ధాంతం అంత విలువైనదని ఎంగెల్సు అన్నాడు. ఆ యిరువురి రచనలన్నిటి ద్వారా ఈ సూత్రం నిరూపితమైంది. భారతీయ మార్క్సిస్టు చరిత్రకారులు డాక్టరు కొశాంబిలాంటి వారు ఈ సూత్రాన్ని అనుసరించేభారత చరిత్రకు సంబంధించిన ఎన్నో సమస్యలను పరిష్కరించారు. ఇంకా ఎన్నో పరిష్కరించవలసి ఉంది.

ఈనాడు ఇది కేవలం ఒక ఊహా ప్రధానమైన ప్రాతిపదిక కాదు. నిరూపిత మైన శాస్త్రీ ప్రమాణం సమాజ చరిత్రను అర్థం చేసుకునేందుకే కాక, దానిని మార్చేందుకు కూడా ఉపయోగపడుతుంది. నిజమే; వివిధ దేశాల సామాజిక చరిత్రకు సంబంధించిన సమస్యలకు, అంతకు పూర్వమే తయారుచేసి పెట్టిన సమాధానాలను చారిత్రక భౌతిక వాదం ఇవ్వజాలదు: ఏ శాస్త్రము ఆ పని చేయలేదు. ఒక సిద్ధాంతం శాస్త్రీయమైనది. అంటే, అపారమైన సమాచారాన్ని సేకరించి, విశ్లేషించి పరిశీలించే శ్రమ ఇక అక్కరలేదని కాదు. కాగా సరైన సిద్ధాంత దర్శనంలేకపోతే ఈ విశ్లేషణ సాధ్యంకాదని మాత్రమే. అన్ని విజ్ఞాన శాస్త్రాలలోవలెనే, మార్క్సిజంలో కూడా, సిద్ధాంతం ఆచరణల ఐక్యత వ్యక్తమయ్యే తీరు ఇదే. ప్రతి సిద్ధాంతాన్ని నిరంతరం అందుబాటులో ఉన్న సమాచారం ద్వారా పరీక్షించుకుంటూ, పరిపక్వం చేసుకుంటూ ఉండాలి.

కారల్‌మార్క్స్ శాస్త్రీయ దృక్పథమే అది. పెట్టుబడిదారీ పూర్వ సామాజిక రూపాలు విచ్ఛిన్నమై, బానిస వ్యవస్థ, ఫ్యూడల్ వ్యవస్థ వంటి సామాజిక రూపాలు ఆవిర్భవించాయి. ఈ రెండు రూపాలు, తప్పనిసరిగా ప్రతి దేశంలోను ఒకదాని తర్వాత ఒకటిగా ఆవిర్భవించ నక్కరలేదని మార్క్స్ భావించినట్లు తోస్తోంది. కొన్ని మార్క్సిస్టు పాఠ్య గ్రంథాలలో ఇదొక అనివార్యమైన క్రమమమైనట్లుగా చెప్పబడ్డది.

ఆసియాటిక్ ఉత్పత్తి విధానం అంటూ మార్క్స్ ప్రస్తావించిన విషయం అందరికీ తెలిసినదే. ఆసియా యూరోపియన్ దేశాలు పెక్కింటిలో ఆదిమ కమ్యూనిస్టు సమాజం ఉండేదని మార్క్స్ గుర్తించాడు. అది విచ్ఛిన్నమవుతూ సృష్టించిన సామాజిక రూపాలలో ఆసియాటిక్ ఉత్పత్తి విధానం ఒకటని మార్క్స్ భావన. ఈ విధానం ప్రత్యేకత ఏమంటే వ్యవసాయం అభివృద్ధి అయింది. అయితే భూమిలో స్వంతఆస్తి పద్ధతి అంటూ లేదు.

భారత్‌లోను మరికొన్ని దేశాలలోను గ్రామ కమ్యూన్ ఉత్పత్తికి ప్రాతిపదిక. స్వయం సంపూర్ణ ఆర్థిక వ్యవస్థపై గ్రామం ఆధారపడి ఉండేది. భూమిపై ఉమ్మడి హక్కు ఉండేది. ఉత్పత్తి మారకం కొరకు కాదు, వినిమయం కొరకు. అదనపు ఉత్పత్తి నిరంకుశుడైన రాజు ధాన్యాగారానికి చేరుకునేది. రాజు గారి పెత్తనంలో ఇట్టి గ్రామాలు చాలా ఉండేవి. కాల్వల త్రవ్వకం, చెరువుల త్రవ్వకం వంటి సామాజిక అవసరాలను రాచరికం నిర్వహిస్తూ ఉండేది.

ఈ సామాజిక రూపం ఆదర్శవంతమైనదని మార్క్స్ శ్లాఘించలేదు. అది కూడా వర్గ సమాజమే. అయితే వర్గ సంఘర్షణ అంత తీవ్రంగా ఉండేది కాదు. గ్రీస్, రోం లలో వలె బానిస వ్యవస్థ లేదు. కాని ఖచ్చితమైన వర్గ వ్యవస్థ లేక కుల వ్యవస్థ ఉండేది. గ్రామీణ జీవిత మూర్ఖత్వం అని మార్క్స్ దీనిని నామకరణం చేశాడు.

కాని ఈ సామాజిక రూపంలో ఒక విశేషం ఉన్నది. గ్రామీణ ఉత్పత్తిలో హెచ్చుభాగం వినిమయం కొరకే జరిగేది. పట్టణాలలో చేతిపరిశ్రమలుండేవి. ఇవి ప్రధానంగా సైన్యం, పాలకవర్గం యొక్క అవసరాలు తీర్చేవి. విలాస వస్తువులను ఉత్పత్తి చేసేవి. ఈ రంగం కూడా త్వరితగతిని అభివృద్ధి అయ్యే అవకాశాలేమీ లేవు. రాజకీయ తుఫానులు ఉండేవి. రాజవంశాలు పడిపోతూ కొత్తవి ఆవిర్భవిస్తూ ఉండేవి. ఇవన్నీ సమాజం యొక్క పై మెట్టును మాత్రమే ప్రభావితంచేసేవి. అట్టడుగున ఉన్న కమ్యూన్ చెక్కుచెదిరేది కాదు. ఇలాంటి సామాజిక రూపమే భారత్, చైనాలలో ప్రాచీన నాగరికత చాలాకాలం అచలాయితనంగా ఉంటానికి కారణమని మార్క్స్ భావించాడు.

ఆసియాటిక్ ఉత్పత్తి విధానం ఒక ప్రత్యేక సామాజిక రూపం అనే వాదనను కొంతకాలం క్రితం ఆమోదించేవారు కాదు. ఆసియాటిక్ ఫ్యూడలిజం రూపాలలో ఇది ఒకటి అని చెప్పేవేశారు. కాగా పెట్టుబడిదారీ పూర్వ సామాజిక రూపాలపై మార్క్స్ వ్రాతప్రతి ఒకటి తాజాగా బైటపడ్డది. దాంతో ఈ సమస్య తిరిగి చర్చనీయాంశమైంది.

మార్క్స్ చెప్పినదంతా పరమ ప్రమాణంగా భావించి, భారతదేశం దీర్ఘకాలం స్తబ్దుగా పడివుండటానికి ఇదే ఏకైక కారణమని భావించనక్కరలేదు. భారతదేశంలోనూ బానిస వ్యవస్థ ఉన్న దాఖలాలు కనిపిస్తున్నాయి. రోం, గ్రీస్ లాంటి రూపం కాకపోవచ్చు. అనాగరికత దశ నుండి నాగరిక దశకు భారతదేశం పరిణామం చెందిన మీదట, స్వయం సంపూర్ణ గ్రామ కమ్యూన్ ఉత్పత్తి ప్రాతిపదికగా రూపొందిన మాట నిజం. ఇది అనేక రూపాలలో వుండేది. తీవ్రమైన మతకలహాలు చెలరేగాయి. పీడిత కులాలు, వర్గాలు, దోపిడికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేశాయి. పిమ్మట భారతీయ తరహా ఫ్యూడలిజం ఆవిర్భవించింది. ఈ రూపం ఎపుడు ఆవిర్భవించింది అనే విషయంలో భారతీయ పరిశోధక పండితులలో భిన్నాభిప్రాయాలున్నాయి. పట్టణ పరిశ్రమలు, వ్యాపారం, నౌకాయానాం వృద్ధిచెందాయి. ఆ పిమ్మట ప్రభుత్వ ఆధ్వర్యంలోనే కార్ఖానాలు అభివృద్ధి చెందాయి.

మొహంజిదారో కాలంనుండి, బ్రిటిష్ హయాంవరకు మనవేలాదిసంవత్సరాల సుదీర్ఘ చరిత్రసంతా, ఏదోఒక సాంప్రదాయకమైన యూరోపియన్ మూసలోకి ఇమడ్చలేము. భారత సమాజంలో వర్గాలు, కులాల పాత్ర, వివిధమత పోరాటాల ప్రాధాన్యం, లోతుపాతులలోకి వెళ్ళి భారత చారిత్రక దశలను వర్గీకరించే భవిష్యత్ మార్క్సిస్టు పరిశోధకులకు మార్క్స్ యొక్క ఈ సృజనాత్మక భావన తోడ్పడవచ్చు.

1853-59 నుండి భారత దేశాన్ని గురించి మార్క్స్ అధ్యయనం ప్రారంభమైంది. అదనపు విలువ సిద్ధాంత ప్రాతిపదికపై, పెట్టుబడి అర్థశాస్త్ర మహావిశ్లేషణకు మార్క్స్ పూనుకుంటున్న కాలం అది.

ఒక విధంగా చెప్పాలంటే భారత దేశంపై మార్క్సు శ్రద్ధాశక్తి యాదృచ్ఛికం. అమెరికానుండి వెలువడే ఉదార వాద దినపత్రిక న్యూయార్కు హెరాల్డు ట్రిబ్యూన్ కోరికపై. బ్రిటన్ వలస విధానాన్ని, పెట్టుబడిదారీ విధానాన్ని బహిర్గతం చేస్తూ వ్యాసాలు వ్రాసేందుకు మార్క్సు పూనుకున్నాడు.

మరోవిధంగా చెప్పాలంటే మార్క్సు శ్రద్ధ ఎంతో సైద్ధాంతిక పునాదితో కూడినది. భారతదేశాన్ని దోపిడీచేసి, బ్రిటిష్ ప్రభువులు పారిశ్రామిక విప్లవానికి అవసరమైన పెట్టుబడిని సమకూర్చుకున్నారు. ఈ దోపిడీద్వారా బ్రిటిష్ ప్రజల అసంతృప్తిని జోకొట్టి అక్కడ పరిపక్వమవుతున్న విప్లవాన్ని వాయిదా వేయగలరు. ఇదొక సైద్ధాంతిక సమస్య.

మార్క్సు పరిశీలనలో మూడు అంశాలు స్పష్టంగా కనిపిస్తాయి.

1) భారతదేశాన్ని ఇంతకు పూర్వం జయించిన పాలకులకంటే, బ్రిటిష్‌పాలన గుణాత్మకంగా భిన్నమైనది. బ్రిటిష్ పాలకులు ఒక ఉన్నత సామాజిక వ్యవస్థకు ప్రతినిధులు. వారు స్వయంసంపూర్ణ గ్రామ కమ్యూన్‌లను ధ్వంసంచేశారు. తమ వలసవిధానాని కనుగుణంగా గ్రామీణ వ్యవసాయ సంబంధాలను మార్పు చేశారు. భారతదేశ గ్రామీణ పరిశ్రమలను ధ్వంసం చేశారు. రైలు, రోడ్డు రవాణా మార్గాలను నిర్మించారు. ఒక సామాజిక విప్లవానికి పరోక్షంగా బీజాలు నాటారు.

2) 1853లో మొదటిసారిగా బొంబాయినుండి థానాకు రైలుమార్గం ప్రారంభమైంది. భారతదేశంలో అనివార్యంగా పారిశ్రామిక వర్గం తల ఎత్తుతుందని మార్క్సు ఆనాడే చెప్పాడు.

3) ప్రతిభా వంతమైన ఈ క్రింది ఊహాను మార్క్సు చేశాడు.

"బ్రిటిష్ బూర్జువా వర్గం నాటిన సమాజ బీజాలను భారతదేశంలో వెదజల్లారు. ఈ ఫలితాలను భారతీయులు వెంటనే అనుభవించజాలరు. బ్రిటన్‌లో పారిశ్రామిక కార్మిక వర్గం, పాలకవర్గాన్ని మార్చి అధికారంలోకైనా రావాలి. లేక హిందువులు తగినంత బలం సంపాదించి భారతదేశంనుండి బ్రిటిష్ వారిని వెళ్ళగొట్టాలి. కాని ఎప్పటికైనా సరే ఆశక్తిదాయకమైన ఈ ప్రాచీన మహా దేశం పునరుజ్జీవనం పొంది తీరుతుంది. భారత పౌరులు పరమ సాత్వికులు ఐనప్పటికి ఇటాలియన్ల కంటే కూడా అతి చురుకైనవారు. తెలివైన వారు. పరాధీనతలో కూడా ఒకానొక ఉదాత్త గంభీరత వీరిలో కనిపిస్తుంది. వీరి ధైర్యసాహసాలు బ్రిటిష్ వారినే ఆశ్చర్య చకితులను చేశాయి. భారత దేశం ప్రపంచ భాషలకు, ప్రపంచ మతాలకు పుట్టిల్లు. భారతదేశంలో ని జాట్ వీరులు ప్రాచీన జర్మన్లను, బ్రాహ్మణులు ప్రాచీన గ్రీకులను గుర్తుకు తెస్తారు."

భారత ప్రజల గురించి ఎంతటి పరిజ్ఞానం, విశ్వాసం, మార్క్సుకున్నదో గమనిస్తే నిజంగా ఆశ్చర్యం కలుగుతుంది.

ఈ వ్యాసాలలోని ఊహాలన్నీ ఆ తర్వాత ధ్రువీకృతమైనాయి. భారత

దేశంలో పెట్టుబడిదారీ అభివృద్ధి అధ్యయనానికి జాతీయ విముక్తి పోరాటం ద్వారా బ్రిటిష్ వలసాధిపత్యాన్ని కూలద్రోయటానికి విశ్వసనీయమైన మార్గదర్శక సూత్రాలనివి సమకూర్చాయి. మార్క్సిస్టు శాస్త్రీయ రాజకీయ అర్థశాస్త్ర ధ్రువీకరణకు ఇంతకంటె వేరే రుజువు ఏమికావాలి ?

రజనీపామీదత్తు వ్రాసిన రెండు పుస్తకాలను, "ఆధునిక భారతదేశం" "నేటి భారతదేశం" (1940 - 46) మార్క్స్ యొక్క ఈ ఊహలే ప్రాతిపదిక. ఈ గ్రంథాలు ఒక గొప్ప విప్లవకారుల తరాన్ని సృష్టించాయి.

జాతీయ విముక్తి పోరాట ఆవిర్భావాన్నిగురించి మార్క్స్ ఊహించటమే కాదు. 1857-58 లో జరిగిన ప్రథమ స్వాతంత్ర సంగ్రామాన్ని ఎంతో శ్రద్ధతో, ఆసక్తితో అధ్యయనం చేశాడు. దీనినే సిపాయి తిరుగుబాటు అని బ్రిటిష్ వారు నామకరణం చేశారు.

భారతీయ విప్లవకారులు గెలిస్తే బ్రిటిష్ ఆర్థిక సంక్షోభం తీవ్రతరమౌతుంది. ఓడిపోతే భారత్‌పై బ్రిటిష్ వలసాధిపత్యం గట్టిపడుతుంది. మార్క్స్ శ్రద్ధాసక్తులలో ఇదికూడా ఒక దృక్కోణం.

భారతదేశం నుంచి ఆనాడు బ్రిటన్‌కు రాకపోకలన్నీ దక్షిణాఫ్రికాను నౌకామార్గంలో చుట్టి వెళ్లుతూ ఉండేవి. ఈ సమాచారంకోసం ఎంతో ఆతృతతో మార్క్స్ ఎదురుచూసేవాడు. విప్లవకారుల దౌర్జన్యాలు అని బ్రిటిష్ బూర్జువా పత్రికలు గగ్గోలు పెడుతుంటే వారిపై బ్రిటిషువారు జరుపుతున్న దౌర్జన్యాల సంగతేమిటి అని ఎదురు ప్రశ్న వేసేవాడు.

1853-59 సంవత్సరాలలో ఎంగెల్స్‌కు ఒక లేఖవ్రాస్తూ మార్క్స్ భారతదేశాన్ని గురించి తన పరిజ్ఞానం చాలా పరిమితం అని అన్నాడు. కాపిటల్ మొదటిభాగం 1867 లో వెలువడిన మీదట భారతదేశాన్ని గురించి అధ్యయనం చేయటానికి తిరిగి పూనుకున్నాడు. భారత చరిత్రను గురించి కాలక్రమాన్ని ననుసరించి నోట్సు రాసుకున్నాడు. అయితే ఈ అధ్యయనాన్ని మార్క్స్ పూర్తి చేయలేకపోయాడు.

భారతీయ సమాజం యొక్క సాంప్రదాయకమైన స్తబ్ధతను గురించి, బ్రిటిషువారు నూతన సామాజిక విప్లవానికి పరోక్షంగా కారకులని మార్క్స్ చెప్పిన మాట నిజమే. బ్రిటిషు వారి ప్రవేశంలేకపోతే ఆధునిక ప్రపంచంలోకి భారతదేశం అడుగుపెట్టేదేకాదు అని దీని అర్థం కాదు. మార్క్సిస్టు చరిత్రకారులెవ్వరూ ఆ విధంగా అర్థం చేసుకోరు మొగల్ పరిపాలన ఆఖరు రోజులలోనే బహుశా భారతదేశంలో విప్లవానికి పరిస్థితులు పరిపక్వమైనాయి. ఈ క్రమాన్ని బ్రిటిషు పత్రిక వక్రీకరించి, అలస్యం చేసింది.

ఈ వలసవాద దుష్ట అవశేషాలను ఇంకా మనం నిర్మూలించుకోవలసిఉంది. ఆ సమస్యలు ఇప్పటికీ మనలను బాధిస్తూనే ఉన్నాయి.

భారతదేశంలో అంతర్గర్భితంగాఉన్న సృజనాత్మక శక్తులను మార్క్స్ ఎంత

గానో ప్రస్తావించాడు. అందుకు సంబంధించిన ఉదంతాలు ఆయన వ్రాసుకొన్న నోట్సులో కనిపిస్తాయి. మార్క్స్ యొక్క అంతర్జాతీయవాద,మానవవాదదృష్టికి ఇది తార్కాణం. పశ్చిమ దేశాల బూర్జువా వర్గ వలసవాద పండితుల సంకుచిత జాతీయ దురహంకారానికి ఇది పూర్తిగా విరుద్ధమైంది.

ఇందుకు తార్కాణంగా నేను రెండు ఉదాహరణలు ఇస్తాను. 1881 లో డా॥ విల్సన్‌కు ఒక లేఖ వ్రాస్తూ మార్క్స్ ఇలా అంటాడు :

"భారతదేశంలో, బ్రిటిషు ప్రభుత్వం చాలా చిక్కులను ఎదుర్కొంటుంది. పెద్ద తిరుగుబాటు వచ్చినా ఆశ్చర్యంలేదు. పన్నులు, లాభాల రూపంలో భారత రైల్వేల నుండి బ్రిటిషు వారు ఎంతో గుంజుతున్నారు. ఈ రైల్వేలు హిందువులకు నిరుపయోగం. ఆఫ్ఘనిస్తాన్ తదితర యుద్ధాలకు, సైనిక, పౌర పరిపాలక సిబ్బంది పెన్షన్లకు ఎంతో డబ్బు కొల్లగొడుతున్నారు. ఇది గాక ప్రతి ఏటా వారు సరుకుల విలువ రూపంలో ఎంతో స్వాహా చేస్తున్నారు. ఇందుకు ప్రతిఫలంగా సమానంగా కాదు కదా, స్వల్పంగా కూడా ఏమీ ముట్టచెప్పటంలేదు. ప్రతి ఏటా ఈ విధంగా భారతీయులు బ్రిటన్‌కు చెల్లించుకునే ఈ ముడుపులు భారతదేశంలోని మొత్తం 60 మిలియన్ల వ్యవసాయ, పారిశ్రామిక కార్మికుల మొత్తం ఆదాయంకంటె హెచ్చుగా ఉంటుంది. కక్షతో జలగ పీల్చినట్లు రక్తాన్ని పీల్చటంతప్ప ఇది మరొకటికాదు. కరువు, ప్రతి సంవత్సరం తీవ్రమైన స్థాయిలో విడవకుండా వస్తున్నది. యూరపులో ఉన్న వారి ఊహకు కూడా అందని విషయం ఇది."

బ్రిటిష్ వలసవాద దోపిడీ తీవ్రతను గురించి మార్క్స్ రాశాడు. దాదాభాయి నౌరోజీ, ఆర్. సి. దత్తు మొదలైనవారు ఇదే సమస్యపై ఆ తర్వాత గ్రంథాలు వ్రాశారు. ఆధునిక జాతీయ విమోచనోద్యమ ఆవిర్భావాన్ని గురించి కూడా మార్క్స్ రాశాడు. "ఏదో కలకలం ఏర్పడుతున్నదని బ్రిటిష్ ప్రభుత్వం కూడా అనుమానిస్తున్నది. హిందువులు, ముస్లింలు ఏకంకావటానికి ఏదో కుట్ర జరుగుతున్నది" అని మార్క్స్ ఈ కలకలాన్ని గురించి ప్రస్తావించాడు.

1882 లో కాట్స్కీకి ఎంగెల్సు రాసిన లేఖ రెండో ఉదాహరణ బ్రిటిష్ వలసవిధానంపట్ల సమకాలీన బ్రిటిష్ కార్మికవర్గం ప్రదర్శించిన వైఖరి మార్క్సుకు ఆశాభంగం కలిగించింది. బ్రిటిష్ బూర్జువా వర్గంలాగానే వారూ ప్రవర్తించసాగారు. కాగా వలసవాదినిత్వంతో మగ్గుతున్న ఇండియా, అల్జీరియా, ఈజిప్టు దేశాలలో ఉత్సాహకర పరిణామాలు రానున్నవని మార్క్స్ ఆశించాడు. భారతదేశాన్ని గురించి ఇలా వ్రాశాడు :

"బహుశా, భారతదేశంలో త్వరలోనే ఒక విప్లవం వస్తుంది. ఆత్మ విమోచనకై పోరాడుతున్న కార్మికవర్గం వలస యుద్ధాలను చేయజాలదు. కనుక ఈ విప్లవం దానిత్రోవన అది పోవాలి.

నిజమే ఎన్నోరకాల విధ్వంసం ఈలోగా జరుగుతుంది. కాని విప్లవాలలో వేటిలో ఐనా అది తప్పదు.

స్వతంత్ర భారతదేశం సోషలిస్టు సమాజంవైపు ఎప్పుడు చేరుకుంటుంది. అని ఆ రోజుననే మార్క్స్ ప్రశ్నవేసుకున్నాడు. అయితే అందుకు ఆయన సమాధానం చెప్పలేదు. మార్క్స్ ఇలా అంటాడు :

"సోషలిస్టు నిర్మాణదశకు చేరుకునే ముందు ఈ దేశాలు ఎలాంటి సామాజిక, ఆర్థిక దశలగుండా ముందుకు సాగుతాయి అనే అంశాన్ని గురించి ఈనాడు ఎలాంటి ఊహలు చేయజాలము."

ఈ వాక్యాలలో ఒక ధ్వని అంతర్గర్భితంగా ఉంది. సోషలిజాన్ని చేరుకునేముందు భారతదేశం తప్పనిసరిగా పెట్టుబడిదారీ దశను అధిగమించవలెనా? ఇందుకు ఆనాడు సమాధానం చెప్పటం సాధ్యంకాదు. 38 ఏండ్ల తర్వాత, ప్రపంచంలో ప్రథమ సోషలిస్టు విప్లవం జయప్రదమైన తర్వాత 1920 లో, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ కాంగ్రెసు ఆమోదించిన వలస దేశాల విమోచనా పత్రంలో, లెనిన్ ఇందుకు సమాధానం చెప్పాడు.

(మాస్కో అండ్ ఇండియా కమ్యూనిస్టు పార్టీ ప్రచురణ వసిల్ 1969— నుండి)



# ప్రపంచ సోషలిజం కమ్యూనిస్టు పంథా - సోషల్ డెమాక్రటిక్ పంథా

రోలండ్ బావర్ (జర్మనీ ప్రజాతంత్ర రిపబ్లిక్)

అక్టోబర్ విప్లవమూ, సోవియట్ యూనియన్ స్థాపనా మార్పు తెచ్చినది ఒక్క దేశంలోగాని, ఒక్క జాతిలోగాని మాత్రమే కాదు. అవి లోతయిన ఆర్థిక, సామాజిక క్రమాలకు శక్తివంతమయిన ప్రేరణ నిచ్చాయి. ఈ క్రమాలు చరిత్ర గతినీ, 20 వ శతాబ్దంలో దేశ దేశాల అభివృద్ధి క్రమాన్నీ మార్చివేశాయి.

ఈ మార్పుల్లోకెల్లా అతి ముఖ్యమయినవి కొన్ని యివీ :

—పెట్టుబడిదారీ విధానం నుంచి సోషలిజానికి మానవాళి పరివర్తన ఆరంభమయింది;

—వరుసగా జరిగిన రెండు ప్రపంచ యుద్ధాల తరువాత, యూరపులో ఈ శతాబ్దంలోకెల్లా సుదీర్ఘమయిన శాంతికాలం ఆరంభమయింది;

—సామ్రాజ్యవాద వలస వ్యవస్థ కూలిపోయి, ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాల్లో అనేక సర్వంసహాధికార రాజ్యాలు ఆవిర్భవించాయి;

—కమ్యూనిస్టు ఉద్యమం అంతర్జాతీయ స్థాయిలో మన కాలంలోని అత్యంత ప్రభావోపేతమయిన రాజకీయ, సైద్ధాంతిక శక్తిగా ఆవిర్భవించింది.

యుగ ప్రాముఖ్యంగల ఈ మార్పుల ప్రాముఖ్యాన్ని భిన్నసామాజిక సిద్ధాంతాలు, నేటికీ వేరు వేరు విధాలుగా అంచనా వేస్తూనే వున్నాయి. కొన్ని వీటిని మరింత పెంపొందించాలని నొక్కి చెబుతుంటే మరికొన్ని దాన్ని వ్యతిరేకిస్తున్నవి. కొన్ని ఈ మార్పుల నిజమయిన అర్థాన్ని తెలియజేస్తుండగా, మరికొన్ని వాటికి వక్రభాష్యాలు చెబుతున్నవి. ఇప్పటికి ఆరు దశాబ్దాలకు పైగా, కార్మికోద్యమంలో కూడా ఈ భావ సంఘర్షణ సాగుతూవుంది.

అక్టోబర్ విప్లవం తరువాత మితవాద సోషల్ డెమొక్రటిక్ సిద్ధాంతవేత్తలు, పనిగట్టుకొని సోవియట్ అధికార వ్యవస్థకు వ్యతిరేకంగా "ప్రజాతంత్ర సోషలిజం" అనే భావాన్నీ, పెట్టుబడిదారీ అభివృద్ధి పంథాకూ, అక్టోబర్ విప్లవం ఆవిష్కరించిన ఉజ్వల పథానికీ ఎక్కడో మధ్యస్తంగా వుంటుందని చెప్పబడే "తృతీయ పంథానూ" ప్రచారం చేశారు. కార్మికోద్యమంలో జాతీయ స్థాయిలోనూ అంతర్జాతీయ స్థాయిలోనూ రెండు పంథాలు—ఒకటి కమ్యూనిస్టు పంథా, రెండోది సోషల్ డెమొక్రటిక్ పంథా—

స్పష్టంగా రూపుగొన్నాయి. సోషలిస్టు విప్లవానికీ, సోషలిజానికీ సంబంధించిన సైద్ధాంతిక, రాజకీయ భావాల రీత్యా యివి ఒకదాని కొకటి భిన్నమయినవి. పరస్పర విరుద్ధమయిన ఫలితాలకు తోవతీసే రెండు భిన్నమైన విధానాలు వాటిలో మూర్తీభవించాయి.

రష్యా దేశం పెట్టుబడిదారీ ప్రపంచ వ్యవస్థకు స్వస్తి చెప్పినప్పుడు, హడలిపోయిన సామ్రాజ్యవాద రాజ్యాలు, పొత్తిళ్ళలో బిడ్డలాంటి సోవియట్ అధికార వ్యవస్థను సైనిక జోక్యం ద్వారా తుడిచిపెట్టజూచాయి: ఆ విధంగా తమ దేశాల్లోని ప్రజానీకంపై అక్టోబర్ మహా విప్లవ ప్రభావాన్ని అదుపు చేయవచ్చును కొన్నాయి. ఆ ప్రయత్నంలో అవి కృతకృత్యులు కాలేకపోయాయి. 1918 లో పలుదేశాల్లో ప్రజావిప్లవాలు, ఏకకాలంలో ప్రజ్వరిల్లాయి. జర్మనీలోనూ, ఆస్ట్రియా-హంగెరీలోనూ మితవాద సోషల్ డెమొక్రటిక్ ప్రభుత్వాలు అధికారంలోకి వచ్చాయి. అవి, సోషలిస్టు ప్రభుత్వాలని చెప్పుకొన్నప్పటికీ, మౌలిక ఉత్పత్తి సాధనాల జాతీయకరణ తమ లక్ష్యమని ప్రకటించినప్పటికీ, వాటి కృషి అంతా, రాచరిక పెత్తనం స్థానంలో, సామ్రాజ్యవాద పెత్తనపు బూర్జువా పార్లమెంటరీ రూపాన్ని ప్రతిష్ఠించేందుకు మాత్రమే తోవ తీసింది. ఇది, పై జెప్పిన రెండు పంథాల మధ్య పోరాటాన్ని తీవ్రం చేసి, 1919 లో సోవియట్ రిపబ్లిక్కుల స్థాపనకు తోవ తీసింది. జర్మన్ నగరం బ్రెమెన్‌లో ఆ ఏడు జనవరి 10 న, హంగెరీలో మార్చి 21 న, బవేరియాలో ఏప్రిల్ 13 న, జకోస్లోవాకియాలో జూన్ 16 న సోవియట్ రిపబ్లిక్కులు స్థాపితమయాయి. బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా, స్పెయిన్, ఇటలీ, బల్గేరియా, పోలెండు మొదలయిన అనేక దేశాల్లో బ్రహ్మాండమయిన సమ్మె పోరాటాలూ, యితర విప్లవ కార్యాచరణలూ జరిగాయి. చైనా, భారత్, కొరియా, టర్కీ మొదలయిన దేశాలలో జాతీయ విమోచనోద్యమం విజృంభించింది.

కార్మికోద్యమ శక్తుల మధ్య విభజన కొనసాగింది. ఆ ఉద్యమంలోని రెండు పంథాలు 1919 లో లాంఛనపూర్వకంగా చీలిపోయి, విడివిడి సంస్థలుగా ఏర్పడ్డాయి. ఫిబ్రవరిలో 26 దేశాలకు చెందిన 97 మంది ప్రతినిధులు బెర్న్‌లో సోషలిస్టు ఇంటర్నేషనల్ సమావేశం జరిపి, నాయకుల అవకాశవాదం కారణంగా అంతకుముందు విచ్ఛిన్నమయిన రెండవ ఇంటర్నేషనల్‌ను పునఃస్థాపించేందుకు ప్రయత్నించారు. ఆ ఏడు మార్చిలో 21 దేశాలకు చెందిన పది కమ్యూనిస్టు పార్టీల, అనేక వామపక్ష సంస్థల, బృందాల ప్రతినిధులు 52 మంది మాస్కోలో సమావేశమై మూడవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను స్థాపించారు.

దీనితో అంతర్జాతీయ కార్మికోద్యమ చరిత్రలో మౌలికంగా ఒక కొత్త దశ ఆరంభమయింది. కొమింటర్న్ ఏర్పాటయిన ఆ ఏడే (1919) 7 కొత్త కమ్యూనిస్టుపార్టీలు ఆవిర్భవించాయి; ఆ మరు

నటి సంవత్సరం మరో ఎనిమిది, ఆ తరువాత సంవత్సరం మరో 12 కమ్యూనిస్టుపార్టీలు ఆవిర్భవించాయి. సోవియట్ యూనియన్ స్థాపన జరిగే నాటికి 40 విప్లవ కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీలు వున్నాయి. 1945 లో, అంటే కొమింటర్న్ రద్దయిన రెండేళ్ళకు వీటి సంఖ్య 71 వుండేది. ఇప్పుడీ సంఖ్య 90 కి పెరిగింది. కొట్టవచ్చినట్లు కన్పించే విషయం కమ్యూనిస్టు పార్టీల సంఖ్యాబలం పెరుగుదల ఒక్కటే కాదు. అంతకన్నా కూడా ముఖ్యమయిన విషయం ఏమిటంటే, అక్టోబర్ విప్లవానంతర కాలంలో యూరపు, ఆసియా, దక్షిణ అమెరికాల్లోని ఒక డజనుకుపైగా దేశాల్లో సోషలిస్టు విప్లవాలు జరిగాయి: ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అవిర్భవించింది; సోషలిస్టు సూత్రాలపై ఆధారపడిన ఒక రాజ్యాల కుటుంబం యిప్పటికి 3 దశాబ్దాలకు పైగా ఏర్పడివుంది.

అక్టోబర్ విప్లవం సోషలిజం నిర్మాణానికి నిజమయిన అవకాశాలను ఆవిష్కరించింది. సోవియట్ యూనియన్ ప్రత్యక్ష ఉదాహరణగా వున్న సమాజ పరివర్తన ప్రయోగాత్మక దశను ఏనాడో గడచివచ్చింది. అది ఆచరణ యోగ్యమని కూడా నిరూపణ అయింది. కమ్యూనిస్టు పార్టీలు ప్రకటించిన సామాజికాభివృద్ధి లక్ష్యాలను, పరిస్థితుల్లో ఎంతో వైవిధ్యంగల దేశాలలో సైతం తప్పక సాధించవచ్చని అనుభవం నిరూపించింది.

ఇక, కార్మికోద్యమంలోని మరో పంథా సాధించిన దేమిటో చూద్దాం. ఇది 1951 లోవి సోషలిస్టు ఇంటర్నేషనల్‌లో మూర్తిమంతమయింది. ప్రజాస్వామ్య సోషలిజం కోసం కృషిచేసే పార్టీల సమ్మేళన అని దాని నిబంధనావళి సోషలిస్టు ఇంటర్నేషనల్‌ను నిర్వచించింది.

రెండవ ఇంటర్నేషనల్ ప్రకటించిన లెక్కల ప్రకారమే దానిలో 48 పూర్తి సభ్యత్వంగల పార్టీలు, మూడు "సోదర సంస్థలు" 17 సలహా ప్రపత్తిగలపార్టీలు, 8 అసోసియేట్ సంస్థలు వున్నవి. వీటిలో మొత్తం రమారమి 15 మిలియన్ల సభ్యులున్నారు. వీరికి రమారమి 80 మిలియన్ల మంది ఓటర్ల మద్దతు వుంది. ఇది నిజంగానే, గణనీయమైన సామాజిక ప్రభావం కలిగిన ఒక ముఖ్యమయిన రాజకీయ శక్తి అనటంలో సందేహం లేదు. అయినప్పటికీ, దాని "ప్రజాస్వామ్యసోషలిజం" లక్ష్యంగానీ1951లో ఆమోదించబడి యిప్పటికీ అమల్లోవున్న ఆ సంస్థ కార్యక్రమం ప్రకారం "లాభ దృష్టికన్నా సమాజ ప్రయోజనాలను మిన్నగా ఎంచే ఆర్థిక వ్యవస్థద్వారా, పెట్టుబడిదారీ వ్యవస్థను" మించిపోవటం గానీ ఒక్క దేశంలోకూడా ఇంతవరకు జరుగలేదు. రెండవ ఇంటర్నేషనల్ ప్రధాన లక్ష్యమేకాదు. అందరికీ ఉపాధులు, ప్రజల సంక్షేమస్థాయి స్థిరాభివృద్ధి, సామాజిక భద్రత, ఆస్తులు, ఆదాయాల న్యాయమయిన పంపిణీవంటి దాని సామాజిక-రాజకీయ కోర్కెలు సైతం నెరవేరలేదు. సోషలిస్టు, సోషల్ డెమొక్రటిక్ పార్టీలు గత కొద్ది దశాబ్దాల్లో అనేక దేశాల్లో పలుసార్లు ప్రభుత్వాలనుఏర్పాటు చేసినప్పటికీ, సంకీర్ణ ప్రభుత్వాల్లో

ముఖ్య భాగస్వాములుగా వున్నప్పటికీ యిదీ పరిస్థితి.

దీనంతటి దృష్ట్యా చరిత్రగతి అని వార్యం. చేస్తున్న నిర్ధారణ ఏమిటంటే, "తృతీయ మార్గం" అనబడుతున్న "ఈ ప్రజాస్వామ్య సోషలిజం" శ్రామికప్రజలకు పెట్టుబడిదారీ వర్గపు శృంఖలాల నుంచి విముక్తి ప్రసాదించలేదు. మహా అయితే, అది ఒక ఊహాస్వర్గం. అత్యుత్తమ ఆశయ ప్రేరితమయినప్పటికీ, అన్ని ఊహాస్వర్గాల వలెనే, వర్గ పోరాటపు కఠిన వాస్తవాలను ఢీకొని పటాపంచలై పోయే ఊహాలోకం.

సామాజిక, రాజకీయ ఉద్యమం ఏదైనా సరే, విజయవంతం కావాలంటే, కాలదోషం పట్టిన ప్రతిపాదనలను విసర్జిస్తూ, ఇబ్బందులనూ, వైరుధ్యాలనూ అధిగమించాలి. అది నిరంతరం మారే ప్రపంచంలోని నూతన పరిణామాలను పరిగణనలోకితీసుకోవాలి; తనపరాజయాల నుంచి, పొరపాటు అంచనాలనుంచి గుణపాఠాలు తీసుకోవాలి.

కమ్యూనిస్టు ఉద్యమం కూడా వైఫల్యాలను చవిచూస్తూ, పొరపాటు భావనలను వదలించుకోవలసి వచ్చింది. కాని, యివేవీ కూడా అక్టోబర్ విప్లవ ఆశయమూ, భావాలయొక్క, సోవియట్ యూనియన్ అనుభవంయొక్క మౌలిక ప్రాముఖ్యాన్నీ, చారిత్రక ఔన్నత్యాన్నీ తగ్గించజాలవు. సోషలిజం అంటే ఎంత మాత్రం గిట్టనివారు సైతం ఒక వాస్తవాన్ని అంగీకరించక తప్పటంలేదు. అదేమంటే, సోవియట్ యూనియన్, అది స్థాపించబడినప్పుడు ఆర్థికంగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలకన్నా ఎంతో వెనుకబడినదిగానూ, తన జనాభాలో నాలుగింట మూడువంతులు నిరక్షరాస్యులున్న దేశంగానూ వుండినప్పటికీ, విదేశీ జోక్యం, అంతర్యుద్ధం, రెండవ ప్రపంచ యుద్ధం తెచ్చిపెట్టిన భయానక విధ్వంసం—వీటన్నిటి దుష్ఫలితాలను అధిగమించి, ఒక అర్ధ శతాబ్ది కాలంలోనే బ్రహ్మాండమయిన ముందంజ వేసింది. అది ఒక గొప్ప పారిశ్రామిక దేశంగా వృద్ధి పొందింది. విద్యా, సాంస్కృతిక రంగాలలో ఉన్నత శిఖరాల నందుకొని రోదసీ పరిశోధనకు బాట వేసింది.

ఇవీ కార్మికోద్యమ కార్యకలాపాలకు సంబంధించిన రెండు పంథాలు సాధించిన ఫలితాలు. యిక యీరెండుపంథాఅనుయాయుల మధ్య సంబంధాలు ఈ నా డె లా వున్నాయి? విప్లవానికీ, సోషలిజానికి సంబంధించిన విషయాలపై కమ్యూనిస్టులకూ, సోషల్ డెమొక్రాట్లకూ మధ్య గల భేదాభిప్రాయాలు సూత్ర సంబంధమయినవి. కాని, అతి తీవ్ర విభేదాలనయినా సరే, శాంతిని కాపాడి, సుపటిష్ఠం చేసేందుకు, అణుయుద్ధ విపత్తును నివారించేందుకు సాగుతున్న పోరాటంలో వాటి మధ్య ఐక్యతకు అడ్డంకి కారాదు.

సోవియట్ చారిత్రకానుభవంప్రపంచ సోషలిజం అంతటికి ఉపయోగపడుతూ వుంది. కమ్యూనిస్టులు అత్యంత క్లిష్టమయిన కొత్త పరిణామాల విషయంలో నిరంతరం నికరమయిన వైఖరిని తీసుకోవలసి వుంటుందనీ, చాలా దూరం వెళ్ళ

(మిగతాది 73వ పేజీలో)

# మార్క్సిజం - నేటి ప్రపంచం

ఈడ్పుగంటి నాగేశ్వరరావు

మార్క్సిజం నేడు ప్రపంచంలో అత్యంత ప్రాముఖ్యమైన, ప్రభావం కలిగిన సిద్ధాంతంగా రూపొందింది. అది నేడు ఒక సాటిలేని మహోద్యమంగా వుంది.

## దీనికి కారణాలు ఏమిటి?

మార్క్స్, ఎంగెల్స్‌ల మౌలిక భావనలు; భవిష్యత్తు ఊహాగానాలు; నిర్ధారణలు సరియైనవేనని చరిత్ర నిరూపించింది. మార్క్స్ కాలంలో అది సిద్ధాంతం. నేడు అది ఆచరణలో వాస్తవ రూపం దాల్చింది. శాస్త్రీయ సోషలిజం సిద్ధాంతం నేడు సోషలిస్టు సామాజిక వ్యవస్థగా విప్లవ కమ్యూనిస్టు ఉద్యమంగా, ఒక మహత్తర శక్తిగా వుంది. సిద్ధాంతాన్ని, కార్యాచరణను వేరుచేసి చూడలేం.

మార్క్స్, భవిష్యత్తును గురించి చెప్పింది ఏమిటి? పెట్టుబడిదారీ వ్యవస్థ బద్దలవుతుంది. దాని స్థానంలో సోషలిజం అవతరణ జరుగుతుంది. ఈ నిర్ధారణ నిరూపితమయింది. సోషలిజంవైపు, కమ్యూనిజంవైపు అనేక దేశాలు పురోగమిస్తున్నాయి. భవిష్యత్తు కమ్యూనిజానిదే.

## నాడు_నేడు

1848లో తొలి కార్మికవర్గ రాజకీయ సంస్థ 'కమ్యూనిస్టులీగు' ఏర్పడింది. అదే సంవత్సరంలో మార్క్స్, ఎంగెల్స్‌ల 'కమ్యూనిస్టు ప్రణాళిక' వెలువడింది. ఆనాడు ప్రపంచంలో కార్మికుల సంఖ్య దాదాపు ఒక కోటి మంది మాత్రమే. నేడు 60 కోట్లకు పైగా వున్నారు. నాడు కమ్యూనిస్టు విప్లవ యోధులు వేళ్ళమీద లెక్కింపదగినంత మాత్రమే. నేడు ఆరుకోట్లకు పైగా వున్నారు. 94 దేశాలలో కమ్యూనిస్టు పార్టీలు కమ్యూనిజంకై పోరాడుతున్నాయి.

పెట్టుబడిదారీ వ్యవస్థ సంక్షోభం, ఆ వ్యవస్థ వున్నంతకాలం వుంటుంది అని మార్క్స్ చెప్పాడు. సంక్షోభ రహిత, స్థిర పురోగతి ఆ వ్యవస్థ లక్షణం కాదు. ఇది వాస్తవమేనని చరిత్ర నిర్ధారించింది.

మార్క్సిస్టు సిద్ధాంతం సమాజ పరివర్తన సిద్ధాతంంగా రూపొందింది. అది సోషలిస్టు దేశాల సిద్ధాంతం. ఆదేశాల పురోగతికి మార్గదర్శక పాత్ర నిర్వర్తిస్తున్నది.

ప్రతి తాత్విక ధోరణి, సిద్ధాంతధోరణి వెనుకవున్న వర్గ ప్రయోజనాన్ని మార్క్సిజం వెల్లడించింది. వర్గాతీత, సిద్ధాంతాలు లేవు. వర్గ సమాజంలో పాక్షికత్వం వుంది అని నిరూపించింది. మార్క్సిజం ఒక శాస్త్రం. అది సత్యాన్ని వెల్లడిస్తుంది. మార్క్సిజం నేడు మార్క్సిజం-లెనినిజంగా వర్ధిల్లుతున్నది.

సోవియట్ యూనియన్ కూలిపోతుందని 1917 అక్టోబరు విప్లవం నాటి నుండి నేటివరకు బూర్జువా సిద్ధాంతవేత్తలు జోస్యంచెపుతూవచ్చారు. తూర్పుయూరప్ దేశాలలో విప్లవాలు పరాజయం పొందుతాయని ఎన్నో కలలుకన్నారు. సోషలిజం విఫలమయిందని కొందరు ఇప్పటికి అరుస్తున్నారు. ఆచరణలో ఇవి అవాస్తవమయినవని స్పష్టమయింది.

సంక్షోభం నుండి పెట్టుబడిదారీ వ్యవస్థ విముక్తి అయినట్టుగా రకరకాల సిద్ధాంతాలు ప్రచారంలో పెట్టారు. ఇదీ అవాస్తమయిన సిద్ధాంతంగా రుజువు అయింది.

మార్క్సిస్ట్ సిద్ధాంతం అభివృద్ధి చెందటంలేదని అది నిర్వీర్యంగా మారిందని కొందరు విమర్శిస్తున్నారు. ఇదే నిజమయితే నేడు సోషలిస్టు వ్యవస్థ, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం ఎలా పురోగమిస్తున్నాయి? విజ్ఞాన రంగాలన్నింటిపైన మార్క్సిజం ప్రభావం నేడుంది. ప్రవర్ధిత సోషలిజంయొక్క లక్షణాలను మార్క్సిజం విశ్లేషణ చేసింది. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ నియమాలను అది వివరిస్తున్నది. పెట్టుబడిదారీ వ్యవస్థ సాధారణ సంక్షోభం, దాని పర్యవసానాలు ఏమిటో మార్క్సిజం వివరిస్తున్నది. నేటి ప్రపంచంలో నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాల పాత్రను అది శాస్త్రీయంగా పరిశీలిస్తున్నది.

## సోషలిస్టు ప్రపంచం

అక్టోబరు (1917) విప్లవం విజయంతో సిద్ధాంతపోరాటం ఒక నూతన దశకు చేరుకుంది. విప్లవానికి ముందు కార్మికవర్గ సిద్ధాంతం, పెట్టుబడిదారీ సిద్ధాంతాల మధ్య సంఘర్షణ ఆ రూపంలో మాత్రమే వుండేది. కాని విప్లవం తరువాత రెండు వ్యవస్థల మధ్య సంఘర్షగా అది మారింది. రెండవ ప్రపంచ యుద్ధంతో ఫాసిజం ఓటమి, సోషలిజం విజయంతో మార్క్సిజం ప్రతిష్ఠ అద్భుతంగా పెరిగినది, నూతన సమాజం (సోషలిస్టు) సంక్షోభరహితమైనది. నిరంతర పురోగతిలోవుంది. ప్రజలజీవన ప్రమాణాలు పెరుగుతున్నాయి. దీని అర్థం పోలెండ్‌లో, గతంలో హంగరీ, జకొస్లొవేకియాలలో ఎట్టి సంక్షుభిత పరిస్థితి ఏర్పడలేదనికాదు. ఆ అసాధారణ పరిస్థితికి ప్రధాన కారకులు కూలిపోయిన దోపిడీవర్గాలే....ఇటువైపు నుండి కొన్ని పొరపాట్లు జరిగాయి. వాటిని అధిగమించి ఆదేశాలు ముందుకు పోతున్నాయి, సోషలిజం కొత్త విజయాలను సాధిస్తున్నది. సుదృఢమైన రాజకీయ, ఆర్థిక వ్యవస్థను ఆ దేశాలు నిర్మించుకోగలిగాయి. సోవియట్ నేడు అనేక రంగాలలో ప్రపంచంలో ప్రథమ స్థానంలోవుంది.

సోషలిస్టు దేశాలలో నూతన జీవిత విధానం అభివృద్ధి చెందింది. దీనికి పునాది సమిష్టివాదం; సోదర సంబంధాలు. ఇది పెట్టుబడిదారీ దేశాలలో వున్న జీవిత విధానానికి భిన్నమైనది.

సోషలిస్టు సమాజం పురోగతిలో ఆ దేశాలలో నూతన మానవుడు రూపొందుతున్నాడు. సోషలిస్టు మానవుడు దేశభక్తిపరుడు; అంతర్జాతీయవాది: మానవుడు సహజసిద్ధంగానే స్వార్థపరుడు; అహంకారి అని బూర్జువా సిద్ధాంత వేత్తలు నూరి పోస్తూవుంటారు. వాస్తవానికి ఇది బూర్జువాజీలు, ఇతరులను అణగద్రొక్కే స్వభావం. స్వార్థమే పరమార్థం అనే భావన, అహంలాంటి గుణాలు వర్గసమాజంతోపాటు పెరిగాయి. వ్యక్తివాదం దీనికి పునాది. ప్రైవేటు ఆస్తి, వర్గాలు చారిత్రకంగా ఒకానొక దశలో ఏర్పడినాయి. కనుక 'మానవ సహజం' గా కనిపించే వ్యక్తివాద లక్షణాలు చరిత్రలో ఒకానొక దశలో వాటినుండి ఏర్పడినవే. అవి శాశ్వతం కావు. ఆదిమ సమాజంలో, ప్రైవేటు ఆస్తిలేని సమాజంలో ఇట్టి లక్షణాలు లేవు. భవిష్యత్తులో వర్గరహిత సమాజంలో ఇవి అదృశ్యమవుతాయి.

సోషలిస్టు దేశాలలో బూర్జువాజీ నియమాలను వాటి అవశేషాలను నిర్మూలిస్తున్నారు. వాటి స్థానంలో సమిష్టితత్వం; సోదరప్రేమ. ప్రాతిప... నూతన విలువలు ఏర్ప...యి. నిస్సందేహంగా సో... వ్యక్తికి, పెట్టుబడిదారీ ...క్తికి మధ్య ఎంతో భిన్నత...

...కమ్యూని...

సోషలిస్టు దేశాలలో ఇంకా అన్య వర్గ ధోరణులు, సిద్ధాంతాలు వున్నాయి. నాయకత్వ సిద్ధాంతం, మార్క్సిజం—లెనినిజం దే.

## పెట్టుబడిదారీ దేశాలు

పెట్టుబడిదారీ ప్రపంచం సర్వవ్యాపిత సంక్షోభంలోవుంది. కొంతకాలం 'జర్మనీ అద్భుతం' అన్నారు. ఆ తరువాత 'జపాన్ అద్భుతం' అన్నారు. ఇప్పుడు అవి ఏమయినాయి? అన్నిదేశాలనూ ద్రవ్యోల్బణం, నిరుద్యోగం, ఆర్థిక మాద్యం ఆవహించాయి. బయటపడే మార్గం కొరకు ఆర్థికవేత్తలు, రాజకీయ నాయకులు తలలు కొట్టుకుంటున్నారు. అనేక దేశాలలో లిబరల్ బూర్జువా పార్టీలు అంతర్ధానమై సోషల్ డెమోక్రటిక్ పార్టీలు రంగప్రవేశం చేసాయి. కొన్ని దేశాలలో ఇవి అధికారంలోకివచ్చి 'మూడవమార్గం' వైపు చూస్తున్నాయి. కాని ఎక్కువ దేశాలలో గుత్త పెట్టుబడి దారీ పార్టీలు, కన్సర్వేటివ్ పార్టీలు అధికారంలో వున్నాయి.

ఈ ప్రభుత్వాల విధానాలపట్ల ప్రజలలో నిరసన పలురూపాలలో వ్యక్తమవుతున్నది. కన్సర్వేటివ్ ప్రభుత్వాలను తిరస్కరించి సోషల్ డెమొక్రసీ ప్రభుత్వాలను కొన్నిదేశాలలో ఎన్నుకున్నారు. రాజకీయ అస్థిరత్వం నేడు ఆ దేశాలలో వుంది.

మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీలు, ఇటలీ, ఫ్రాన్సు, గ్రీసు, ఫిన్లాండ్, లాంటి దేశాలలో పెద్ద పలుకుబడిగల పార్టీలుగా అవతరించాయి. అనేక దేశా

లలో పార్లమెంటరీ ప్రాతినిధ్యాలు కలిగి సొంత పత్రికలు, ప్రచురణాలయాలను నిర్వహిస్తున్నాయి. మార్క్సిజం సిద్ధాంత ప్రభావం కమ్యూనిస్టుల పలుకుబడి కారణంగా సోషల్ డెమాక్రసీలోని కొన్ని భాగాలు గుత్త వ్యతిరేక చర్యలకై ఐక్యకార్యాచరణకు ముందుకు వస్తున్నాయి.

## నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు

చైనా, వియత్నాం, ఇండోనేషియా, చిలీ దేశాలలో కమ్యూనిస్టు పార్టీలు 1920, 1930 దశకాలలోనే ఒక పెద్ద రాజకీయ శక్తిగా అవతరించాయి. ఆ తరువాత అనేక యితర దేశాలలో కమ్యూనిస్టు పార్టీలు జాతి జీవన రంగములో ముఖ్యపాత్ర వహించే స్థితికి చేరుకున్నాయి.

నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలలో పెట్టుబడిదారీ పంథాను ఎన్నుకొన్న దేశాలు సంక్లిష్ట పరిస్థితిని ఎదుర్కొంటున్నాయి. ఆ దేశాలు అంతర్జాతీయ పెట్టుబడిదారీ మార్కెట్‌లో భాగంగా వున్నాయి. అంతర్జాతీయ పెట్టుబడిదారీ వ్యవస్థ 1929-31 నాటి సంక్షోభం లాంటి ఒక తీవ్ర పరిస్థితిని నేడు యెదుర్కొంటున్నది ఆ సంక్షోభ భారం తృతీయ ప్రపంచ దేశాలపైపడుతున్నది. పెట్టుబడిదారీ పంథాలో పయనించే నూతన స్వతంత్ర దేశాలు యెప్పటికి సకలరంగాలలో గణనీయమైన అభివృద్ధి సాధించగలవు? పెట్టుబడిదారీ అభివృద్ధి పంథా, నయావలస విధానం రెండూ విడదీయరాని సంబంధాలు కలిగివున్నాయి. కనుకనే ఆ దేశాలు ఒక విషవలయంలో చిక్కుకున్నాయి.

ప్రపంచ వ్యాపితంగానే మార్క్సిజం ప్రతిష్ట పెరగటంతో, ఈ దేశాలలో బూర్జువా వర్గం రకరకాల బూర్జువా "సోషలిజం" సిద్ధాంతాల ముసుగులను ధరించాయి. కనుకనే ఈ దేశాలలో (భారతదేశంతో సహా) సిద్ధాంతరంగంలో పోరాటం సంక్లిష్ట రూపం తీసుకున్నది. బూర్జువా "సోషలిజం" సిద్ధాంతాన్ని అటు సామ్రాజ్యవాద దేశాలలోని బాహాటమైన బూర్జువా సిద్ధాంతానికి ఇటు కార్మికవర్గ సిద్ధాంతానికి పోటీ పెట్టటం జరుగుతున్నది.

పెట్టుబడిదారీయేతర పంథాను (సోషలిజంవైపు మొగ్గు) యెన్నుకున్న దేశాలలో రివల్యూషనరీ డెమాక్రాట్లు, నాయకత్వ స్థానాలలో వున్నాయి. వీరిలో ఒక ముఖ్యభాగం మార్క్సిజంను తమ సిద్ధాంత పతాకంగా స్వీకరించారు. అంగోలా, మొజాంబిక్, దక్షిణ ఏమెన్ లాంటిదేశాలలో మార్క్సిజం ప్రభావం నూతన సెక్షన్లకు విస్తరిస్తున్నది. అంగోలా లాంటి దేశాలలో పాలకపార్టీ మార్క్సిజం సిద్ధాంతాన్ని బాహాటంగానే స్వీకరించింది.

[illegible] మారు 60 దేశాలలో కమ్యూనిస్టు పార్టీ [illegible] క విప్లవాలకై పోరాడుతున్నా [illegible] అర్జెంటైనా, చిలీ ఉరుగ్వేల, [illegible] కాఫ్రికా లాంటి దేశాలలో క [illegible] ఠోర నిర్బం



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M134 |
| పుస్తకం పేరు | కమ్యూనిజం |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 75 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | NAVYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |